# జ్యోతిస్సాముద్రిక-చంద్రిక

సంపుటము ౧  సంచిక ౧



PATRON




**H. E. MAHARAJAH SIR KISHEN PRASAD BAHADUR,**
G. C. S. I. K. C. I. YAMINUS SULTANUS
*PRIME MINISTER.*
H. E. H. THE NIZAM'S GOVERNMENT.

# విషయసూచిక





సంవత్సర చందా రు **5-0-0** విడి పత్రిక రు **0-8-0**

## గమనిక

ఈ సంచికయందలి 5 వ పేజీయున్నూ, 28 వ పేజీయున్నూ వొదిలివేయవలసినదిగా కోరుచున్నాము. ఈ సంచిక యింతకుముందే ముద్రింపబడుటచే పైవేర్కొనబడిన పుటలు మనకు ప్రస్తుతకాలమునకు వర్తింపవు.

# జ్యోతిస్సాముద్రికచంద్రిక

సంపాదకుడు: మల్లాది దక్షిణామూర్తి శాస్త్రి, బెజవాడ.

సంపుటము ౧ { ప్రమాధి సంవత్సర ఆశ్వీజ శుద్ధ పౌర్ణమి { సంచిక ౧

## తొలిపలుకు

ఈ మా జ్యోతిస్సాముద్రికచంద్రిక ప్రతిమాసమునను విజయవాడనుండి వెలువడుచుండును. ఇందు జాతక సాముద్రిక రేఖా హస్త వాస్తు ప్రశ్న మొదలగు మానవుని భూతభవిష్య ద్వర్తమానములను తెలుపుశాస్త్రములనుగూర్చి విపులముగ చర్చించుచుందుము. మైసూరు ప్రభుత్వమువారును, గద్వాల దొరతనమువారును నేటివరకు పూర్వాచారము ననుసరించి పండితసభ లొనర్చుచు శాస్త్రచర్చల గావించు చున్నారు. మన ఆంధ్రదేశమందు సహితము కొన్ని సంస్థానములవా రట్టికీర్తినే పొందగలుగుచున్నారు. పై కారణముచే మనశాస్త్రము లింతవరకు నామమాత్రావశేషములుగానైన నుండవీలైనవని తలంచు టతిశయోక్తి గాజాలదు. ఏశాస్త్రమైనను ప్రభుపోషణ గాంచనిదే చిరకాలము నిలువజాలదు. ప్రస్తుతము శిథిలావస్థలోనున్న ఈ శాస్త్రములను ప్రభుకోటి సాయముతో ప్రజాలోకము నెదుట నుంచుటకై ఈపత్రికను ముద్రింప సాహసించితిమి. ఆంధ్రదేశమందలి ప్రభువులు ఈ మా సాహసమునుమన్నించి మాకుసంపూర్ణమగు సాయము నొసర్తురని విశ్వసించుచున్నారము. లోకమునకు శాస్త్రము నేత్రమువంటిది. నేత్రముఖ కగోచరములగునవి సహితము శాస్త్రదృష్టి నతిక్రమింపజాలవు. ప్రతిమానవుని జీవితము ఆతని హస్తమందే లిఖింపబడియున్నది. ఆంగ్లభాషాపారంగతుడు సంస్కృతవాఙ్మయము నర్థము చేసుకొనజాలని రీతిని మానవుడు సాముద్రికశాస్త్రజన్యజ్ఞానములేనిదే తనహస్తమందు రేఖాభాషతో లిఖింపబడిన తనజీవితమునే తెలుసుకొన జాలకపోవుచున్నాడు. మా యీపత్రికలో ముందుముందు సాముద్రిక శాస్త్రమునకు సంబంధించిన వాఙ్మయమును విపులముగా చేతిముద్రలతో (Hand Prints) సహితము ప్రకటించి లోకమునకు కొంతశాస్త్ర పరిచయము చేయగలమని తలంచుచున్నాము. జ్యోతిశ్శాస్త్రమునుగూర్చికూడా విపులముగా తర్కింపగలము. మహామహులు మా యీ యుద్యమమునకు తోడ్పడి మమ్ముకృతార్థులను చేతురు గాకయని వినయపూర్వకముగ మరియొకసారి ప్రార్థించుచున్నారము.

# స్వకీయము

## పత్రికోద్దేశము

భారతఖండము మహాపరాక్రమవంతమైనట్టియు ధర్మపరిపాలనాసక్తమైనట్టియు నిరంతరశాస్త్రవ్యాసంగానురక్తి గలిగినట్టియు పండిత పారిజాతమైనట్టి ప్రభుకోటికి మాతృభూమియై తేజరిల్లెడిది. అట్టి ప్రభుకోటి యాదరణ తొలగినతోడనే దేశక్షేమంకరములగు శాస్త్రములు నశింపదొడగి ప్రజాదరణసహితము గోల్పోయి నేడు నామమాత్రావశేషములైనవి. సమస్తవిజ్ఞానమునకు పుట్టినిల్లగు భారతావని నేడు నిస్తేజస్కయై యుండుట కడుంగడు శోచనీయము. ఈ సమయమున పాశ్చాత్యదేశములు విజ్ఞానవంతములై కళౌన్నత్యముచే ప్రపంచమును దిగ్భ్రమ గొల్పుచున్నవి. విజ్ఞానాన్వేషణకై ప్రజాదరణతోపాటు ప్రభుపోషణయును మితిమీరిపోవుచున్నది. అందునను జ్యోతిషము సాముద్రికములకు కొంత ప్రాధాన్య మీయబడినది. ప్రభువులుసహితము పైశాస్త్రజ్ఞులకు అన్నివిధముల తోడ్పడుచుండిరి. కీ॥ శే॥ సప్తమ ఎడ్వర్డు చక్రవర్తిగారు, లార్డు కిచనర్ మొదలగు సుప్రసిద్ధులు తమ హస్తముద్రలను (Hand Prints) సహిత మొసగి అట్టివారి కపారమగు చేయూత నొసంగిరి.

ప్రజాసహకారబుద్ధియు పట్టుదలయుగల పాశ్చాత్యదేశములలో ఈశాస్త్రము లతిత్వరగా నభివృద్ధిలోనికి వచ్చుచున్నవి. పాశ్చాత్యానుకరణ మొనర్చుచున్న భారతీయులకు సహితము ఈ శాస్త్రములలో కొంత యభిరుచి కలుగసాగినదనుట సత్యదూరముకాదని తలంతుము. పాశ్చాత్యశాస్త్రగ్రంథములే నేడు భారతీయ యువకహస్తముల నలంకరించుచున్నవి. అందుచే పామరజనమున కింతవరకు ఒకవృత్తిగా పరిగణింపబడుచున్న యీ జ్యోతిస్సాముద్రికశాస్త్రములకు నాగరికతాప్రపంచమున కొంత గౌరవస్థానము లభించి ఇదియొకశాస్త్రము (Science) అను దృఢనమ్మిక కలిగినది.

సాముద్రిక శాస్త్రాధారముచే మానవునిహస్తమందలి రేఖా సముదాయమును పరీక్షించి జాతకమునకు వలెయు సామగ్రిని(జాతకచక్రము మొ॥) నిర్మించుకొనవచ్చును. జాతకమునుజూచి భవిష్యత్తును గ్రహింపగల్గు రీతిని మానవుని సమస్త అవయవపరిశీలన మొనర్చి భవిష్యత్ఫలములను తెలుసుకొనుట నీ సాముద్రికశాస్త్రము బోధించును. జ్యోతిస్సాముద్రికశాస్త్రము లపారములయినవగుటచేతను, పూర్ణపరిజ్ఞానము సంపాదింపజాలిన పండితు లేకొలదిమందియో మన ఆంధ్రభూమిలో నుండుటచేతను ఈశాస్త్రము జనులకంతగా నందుబాటులో లేకపోయెను. ప్రజ్ఞాపారంగతుల అమూల్యవ్యాసములచే విరాజిల్లు మా యీపత్రిక అట్టి కొరతలేకుండ చేయుగాక యనియు మీమన్ననకు పాత్రమగుగాకయనియు సర్వేశ్వరుని ప్రార్థించుచు మా యీ తొలి సంచికను మీ హస్తకమలముల కందించుచున్నాము.

## పరిచయము

బహుకాలమునుండి హస్తజ్యోతిషమునొక పత్రికను ప్రకటించుటకు యత్నములను చేయుచున్నను సాధ్యముగాలేదు.

సమస్తదేశములయందును నేడు సాముద్రిక జ్యోతిశ్శాస్త్రములు విశాలగౌరవమును పొందుచున్నను మన యాంధ్రదేశమున మాత్ర మట్టి నోము నోచుకొనలేదు. అనేక పర్యాయములు అనేక జ్యోతిశ్శాస్త్ర పారంగతులు ఈసంబంధమైన మాసపత్రికలను ప్రారంభించి యుండిరి. కాని ఏపత్రికయు శైశవావస్థను దాటియుండ

లేదు. పత్రికలు నిలవకుండుటయగాక పత్రికాసంపాదకులు సహితము మరణించిరి. తోలుదోలుత అమలాపురమునుండి యువటూరి అయ్యన్నగారు జ్యోతిషపత్రికాశకము ప్రారంభించి రెండవవత్సరమునసే నిలిపివేసిరి. తదుపరి మరికొంతకాలమునకు వారుకూడ దేహమును చాలించుకొనిరి. తెనాలినుండి సుప్రసిద్ధపండితసోదరుడగు పార్వతీశంగారు జ్యోతిష యను పత్రికను ప్రకటించి యేస్వల్పమాసములుమాత్ర మోనడపి దివంగతులైరి. గోపాలపురమునుండి జ్యోతిశ్చంద్రికయను మరియొక పత్రిక వెడలి నవమాస స్ఫూర్తిగాకనే నశించెను.

ఇదికాదని యువటూరి వినాయకరావుగారు మదరాసు తిరువళిక్కేణినుండి యాంగ్లభాషను జ్యోతిషచంద్రికను ప్రకటించి నూతన మార్గమును ద్రొక్కిరి. కాని యాంధ్రదేశమునకు జ్యోతిషమాసపత్రిక అచ్చిరాకుండుట బట్టియో జ్యోతిష మాస పత్రికా చరిత్రము ననుసరించియో పూర్వాచారమునకు విరుద్ధము గాకుండునట్లు నాల్గుమాసములు నిండకుండగనే రూపము మాసిపోయెను. నవమాసములు నిండకుండగనే పత్రికాసంపాదకుడుకూడ స్వర్గస్థుడయ్యెను. ఆంధ్రదేశమున జ్యోతిషమాసపత్రికల చరిత్రలనుబట్టి విచారించినచో మన దేశమున కీపత్రికా ప్రచారము అచ్చుబాటు కాలేదని తేలుచున్నను సాముద్రిక శాస్త్రము ప్రకృతి మొదలగు నితర శాస్త్రములతో ప్రకాశించు నీ జ్యోతిస్సాముద్రికచంద్రిక ప్రతిమాసపూర్ణిమకును విజయవాడనుండి శ్రీదుర్గా కటాక్షమున ప్రకటింపబడుచు తేజరిల్లుగాక యని యాశించుచున్నాము.

ఈ పత్రికాముఖమున సమస్త గ్రహసంచలన విశేషమునుబట్టి విశ్వమునేగాక మానవ భావి జీవిత చరిత్రములను సూచించుచుండు సమస్త శాస్త్రములును ప్రకటింపబడును. ఇందు ముఖ్యముగా సాముద్రికజ్యోతిశ్శాస్త్రములకు గల సంబంధము సిద్ధాంతీకరింపబడుచుండును.

మానవ హస్తమున తేజోరూపమున ప్రకాశించుచుండు రేఖా పంక్తులకును, ద్వాదశ రాశులయందు సంచరించు గ్రహములకునుగల సంబంధము ప్రత్యక్షముగను సప్రమాణముగను నిరూపించును.

దేశమునకు కీర్తి దెచ్చునవి శాస్త్రరాజములే యగుటంబట్టి సమస్త విద్యాభిలాషులు ఈ పత్రికాపాఠకులుగను శాస్త్రవిమర్శకులుగను చేరుదురు గాకయని మా ప్రార్థన.

ఆంధ్రదేశమున జ్యోతిస్సాముద్రిక పరిషత్తు అను యొక సంఘమును స్థాపించినారము. ఈ సంఘమున చేరువారందరును జ్యోతిస్సాముద్రిక శాస్త్రములను తెలిసినవారై యుండవలయును. ఈ దైవజ్ఞసంఘము ఈశాస్త్రముల యభివృద్ధికొరకును ప్రచారమునకును పాటుబడును ప్రస్తుతము అమలులో నున్నటువంటి పత్రికలలో ముఖ్యములు: మహారాష్ట్రమున రఘునాథశాస్త్రి జ్యోతిష అను మాసపత్రికయు బెంగుళూరులో సూర్యనారాయణగారిపత్రికయు బనారసుసిటీలో (celestial messenger), దైవజ్ఞ వార్తాహరుడు మొదలగునవియు నైయున్నవి.

పాశ్చాత్య జ్యోతిస్సాముద్రిక శాస్త్రజ్ఞులు కూడ యనేక మాసపత్రికలను పాశ్చాత్యదేశములయందు కడు శ్రద్ధతో నడపుచున్నారు. ప్రజలుకూడ అందు కంగీకరించి తగువిధమున పోషించుచున్నారు. నా కందిన విదేశ జ్యోతిష మాసపత్రికల పేర్ల నిచ్చుట నుదహరించుచున్నాను. ది టార్చి (The torch)

(2) Lwellyen Astrology (3) Prophecy (4) Astrology

ఈ పత్రికలయందే విధమైన విశేష శాస్త్రమునుగూర్చి వ్రాయకపోవుట కడుశోచనీయము. సాముద్రిక శాస్త్రమునుగూర్చినపత్రికలువిదేశములయందు సహితము లేవు. ఏయొక సాముద్రిక మాసపత్రిక యున్నదేమోగాని ఇంతవరకు ఇట్టి సంగతి మాకు తెలియదు. దీనికి గారణము యీ శాస్త్ర మంతగా జనసామాన్యమున కందుబాటులోనికి రాకుండుటయే. నా స్నేహితులగు పై పాశ్చాత్య జ్యోతిషమాసపత్రికా సంపాదకులు కూడ పాశ్చాత్య సాముద్రిక మాసపత్రిక లున్నట్లు మాకు తెలియదని వ్రాసిరి. జ్యోతిస్సాముద్రిక మాసపత్రికాసంపాదకులు ఒకరి పత్రికల నొకరి కంపుకొనుచుండు సభ్యత ననుసరించి పంపుకొనుచుందురు. అట్లంపుకొను సందర్భములో సాముద్రికమాసపత్రిక వారు విని యుండకపోవుట కారణముగ వచించుచున్నారు.

మనభరతదేశమునందుకూడ ప్రత్యేక సాముద్రిక మాసపత్రిక లింతవరకు లేవు. ఇదియే ప్రారంభపత్రిక.

ఈ పత్రిక నడపుటలో రెండు మూడు పెద్ద యాటంకములు గలవు. సాముద్రిక శాస్త్రము నందు నిరర్గళమైన పాండిత్య ముండవలెను. ఇది యంతగా మన భారతీయుల కబ్బలేదు. అట్టిపాండిత్యమునలవరచుకొనుటకుతగినసాధనసామగ్రియు లేదు. రెండవకారణము ధనాభావము. వ్రాయు పత్రికలో ప్రతివాక్యమునకును ఉదాహరణముగ బొమ్మలను (blocks) చగాపుచుండవలయును. ప్రతిసంచికయందును బొమ్మలద్వారా యీ శాస్త్రస్వరూపమునుచూపుట కధిక ధనవ్యయము ప్రతిమాసమునను అగుచుండును. ఇందుమూలమున పత్రికానిర్వహణము భారమైతోచును. మూడవది ప్రజాదరణయు ప్రభుకోటి పోషణయు లేకపోవుట యని భావించవలసియుండును. కాబట్టి నేను పూనుకొనిన యుద్యమమునకు దైవము, ప్రజలు, ప్రభుకోటి చేయూతనొసంగి దిగ్విజయమైనదానినిగా చేయుదురుగాక.

---

# ఫలానుభవము

ఫలానుభవ సందర్భము ననుసరించియు ఫలనిర్ణయ విషయముల ననుసరించియు చూచినచో జ్యోతిషమునకు మిన్న సాముద్రికశాస్త్రమని స్పష్టమగుచుండును. ఈ యుభయ శాస్త్రములయందును, సాముద్రికశాస్త్రము మిగులయనుభవనీయమైనదని యీ పత్రికాముఖమున సంపూర్ణవినయమున నిర్ధారణచేయుచున్నాను. ఫలానుభవములనుబట్టి శాస్త్రమునకు మర్యాదయు గౌరవమును వాటిల్లుచుండును. ఇందువలననే ప్రస్తుతయుగమున సాముద్రికశాస్త్రమునకు ప్రాముఖ్యతగలుగుచున్నది. ఇది మిగుల ప్రత్యక్షశాస్త్రము శుభాశుభఫలములు రెండునూ హస్తములయందు కంటికగపడుచుండును. జాతకమున పదిరెండురాసులనుబట్టియు తొమ్మిదిగ్రహములను బట్టియు, భిన్నభిన్నములగు జ్యోతిషమతములగల్గిన శాస్త్రములనుబట్టియు పండితుడూహించవలసియుండును. పసుపు సున్నమును కలిపినచో పసుపు తెలుపు రంగుల రెండింటిని పొందక యొకపురంగు కలుగునట్లు వివిధములగు గ్రహముల సమ్మేళనయొక్క పరిస్థితుల ననుసరించి పండితునియూహలకు భిన్నముగ ఫలము లనుభవమగుచుండును. ఇందుమూలమున శాస్త్రముల కపఖ్యాతి కల్గుచున్నది.

సాముద్రికశాస్త్రము మిగుల అనుభవశాస్త్రమనియు బహునిదర్శనమనియు ఋజువుచేయుటకై ప్రతిమాసమునను, నాచే నుడువబడినట్టియు, అనేక మహారాజ దర్బారులయందు పరీక్షింపబడినట్టియు ఫలములను, హస్తముద్రలను ఈ పత్రికాముఖమున వివరించుచుండును. జ్యోతిశ్శాస్త్రమునకూడ యిట్టిఫలములను చెప్పబడగలవని ఋజువుచేయుపండితసోదరులు, ఇందీయబడిన జాతకచక్రములమీద ఫలములనువ్రాసి మా పత్రికాకార్యాలయమునకు పంపినచో కీర్తియు, బహుమానమును కూడ బడయగల్గుదురు. యథార్థమైనశాస్త్రకృషి చేయువారగుదురు.

12-4-36 లగాయతు 13-5-36వరకు గంటలప్రకారము లగ్న ప్రమాణములు, దినచర్య, సుముహూర్తములు మొదలగునవి చూచుకొనుటకు వీలుగానుండును. —ప్రొ. కె. యస్. సింగ్.

| తేది | మేషం | వృషభం | మిధునం | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 12-4-36 | ఉ7-31కు | ఉ9-30కు | ప11-40కు | ప 1-52కు | సా4- 0కు | సా6- 6కు | రా8-16కు | రా10-29కు | రా12-37కు | తె 2-30కు | తె4-10కు | తె5-47కు |
| 13-4-36 | ఉ7-27,, | ఉ9-26,, | ప11-36,, | ప 1-48,, | సా3-56,, | సా6- 2,, | రా8-12,, | రా10-25,, | రా12-33,, | తె 2-26,, | తె4- 6,, | తె5-43,, |
| 14-4-36 | ఉ7-24,, | ఉ9-23,, | ప11-33,, | ప 1-45,, | సా3-53,, | సా5-59,, | రా8- 9,, | రా10-22,, | రా12-30,, | తె 2-23,, | తె4- 3,, | తె5-40,, |
| 15-4-36 | ఉ7-21,, | ఉ9-20,, | ప11-30,, | ప 1-42,, | సా3-50,, | సా5-56,, | రా8- 6,, | రా10-19,, | రా12-27,, | తె 2-20,, | తె4- 0,, | తె5-37,, |
| 16-4-36 | ఉ7-18,, | ఉ9-17,, | ప11-27,, | ప 1-39,, | సా3-47,, | సా5-53,, | రా8- 3,, | రా10-16,, | రా12-24,, | తె 2-17,, | తె3-57,, | తె5-34,, |
| 17-4-36 | ఉ7-15,, | ఉ9-14,, | ప11-24,, | ప 1-36,, | సా3-44,, | సా5-50,, | రా8- 0,, | రా10-13,, | రా12-21,, | తె 2-14,, | తె3-54,, | తె5-31,, |
| 18-4-36 | ఉ7-12,, | ఉ9-11,, | ప11-21,, | ప 1-33,, | సా3-41,, | సా5-47,, | రా7-57,, | రా10-10,, | రా12-18,, | తె 2-11,, | తె3-51,, | తె5-28,, |
| 19-4-36 | ఉ7- 8,, | ఉ9- 7,, | ప11-17,, | ప 1-29,, | సా3-37,, | సా5-43,, | రా7-53,, | రా10- 6,, | రా12-14,, | తె 2- 7,, | తె3 47,, | తె5-24,, |
| 20-4-36 | ఉ7- 5,, | ఉ9- 4,, | ప11-14,, | ప 1-26,, | సా3-34,, | సా5-40,, | రా7-50,, | రా10- 3,, | రా12-11,, | తె 2. 4,, | తె3-44,, | తె5-21,, |
| 21-4-36 | ఉ7- 2,, | ఉ9- 1,, | ప11-11,, | ప 1-23,, | సా3-31,, | సా5-37,, | రా7-47,, | రా10- 0,, | రా12- 8,, | తె 2- 1,, | తె3-41,, | తె5-18,, |
| 22-4-36 | ఉ6-59,, | ఉ8-58,, | ప11- 8,, | ప 1-20,, | సా3-28,, | సా5-34,, | రా7-44,, | రా9 -57,, | రా12- 5,, | తె 1-58,, | తె3-38,, | తె5-15,, |
| 23-4-36 | ఉ6-54,, | ఉ8-53,, | ప11- 3,, | ప 1-15,, | సా3-23,, | సా5-29,, | రా7 39,, | రా9 -52,, | రా12- 0,, | తె 1-53,, | తె3-33,, | తె5-10,, |
| 24-4-36 | ఉ6-50,, | ఉ8-49,, | ప10-59,, | ప 1-11,, | సా3-19,, | సా5-25,, | రా7-35,, | రా9 -48,, | రా11-56,, | తె 1-49,, | తె3-29,, | తె5- 6,, |
| 25-4-36 | ఉ6-46,, | ఉ8-45,, | ప10-54,, | ప 1- 7,, | సా3-15,, | సా5-21,, | రా7-31,, | రా9 -44,, | రా11-52,, | తె 1-45,, | తె3-25,, | తె5- 2,, |
| 26-4-36 | ఉ6-42,, | ఉ8-41,, | ప10-50,, | ప 1- 3,, | సా3-11,, | సా5-17,, | రా7-27,, | రా9 -40,, | రా11-48,, | తె 1-41,, | తె3-21,, | తె4-58,, |
| 27-4-36 | ఉ6-37,, | ఉ8-36,, | ప10-45,, | ప12-58,, | సా3- 6,, | సా5-12,, | రా7-22,, | రా9 -35,, | రా11-43,, | తె 1-36,, | తె3-16,, | తె4-53,, |
| 28-4-36 | ఉ6-32,, | ఉ8-31,, | ప10-40,, | ప12-53,, | సా3- 1,, | సా5- 7,, | రా7-17,, | రా9 -30,, | రా11-38,, | తె 1-31,, | తె3-11,, | తె4-48,, |
| 29-4-36 | ఉ6 28,, | ఉ8-27,, | ప10-36,, | ప12-49,, | సా2-57,, | సా5- 3,, | రా7-13,, | రా9 -26,, | రా11-34,, | తె 1-27,, | తె3- 7,, | తె4-44,, |
| 30-4-36 | ఉ6-24,, | ఉ8-23,, | ప10-32,, | ప12-45,, | సా2-53,, | సా4-59,, | రా7- 9,, | రా9 -22,, | రా11-30,, | తె 1-23,, | తె3- 3,, | తె4-40,, |
| 1-5-36 | ఉ6-20,, | ఉ8-19,, | ప10-28,, | ప12-41,, | సా2-49,, | సా4-55,, | రా7- 5,, | రా9 -18,, | రా11-26,, | తె 1-19,, | తె2-59,, | తె4-36,, |
| 2-5-36 | ఉ6-16,, | ఉ8-15,, | ప10-24,, | ప12-37,, | సా2-45,, | సా4-51,, | రా7- 1,, | రా9 -14,, | రా11-22,, | తె 1-15,, | తె2-55,, | తె4-32,, |
| 3-5-36 | ఉ6-12,, | ఉ8-11,, | ప10-20,, | ప12-33,, | సా2-41,, | సా4-47,, | రా6-57,, | రా9 -10,, | రా11-18,, | తె 1-11,, | తె2-51,, | తె4-28,, |
| 4-5-36 | ఉ6- 8,, | ఉ8- 7,, | ప10-16,, | ప12-29,, | సా2-37,, | సా4-43,, | రా6-53,, | రా9 - 6,, | రా11-14 ,, | తె 1- 7,, | తె2-47,, | తె4-24,, |
| 5-5-36 | ఉ6- 4,, | ఉ8- 3,, | ప10-12,, | ప12-25,, | సా2-33,, | సా4-39,, | రా6-49,, | రా9 - 2,, | రా11-10,, | తె 1- 3,, | తె2-43,, | తె4-20,, |
| 6-5-36 | ఉ6- 0,, | ఉ7-59,, | ప10- 8,, | ప12-21,, | సా2-29,, | సా4-35,, | రా6-45,, | రా8 -58,, | రా11- 6,, | రా12-59,, | తె2-39,, | తె4-16,, |
| 7-5-36 | ఉ5-56,, | ఉ7-54,, | ప10- 4,, | ప12-17,, | సా2-25,, | సా4-31,, | రా6-41,, | రా8 -54,, | రా11- 2,, | రా12-55,, | తె2.35,, | తె4-12,, |
| 8-5-36 | ఉ5-52,, | ఉ7-50,, | ప10- 0,, | ప12-13,, | సా2-21,, | సా4-27,, | రా6-37,, | రా8 -50,, | రా10-58,, | రా12-51,, | తె2-31,, | తె4- 8,, |
| 9-5-36 | ఉ5-48,, | ఉ7-46,, | ప9 -56,, | ప12- 9,, | సా2-17,, | సా4-23,, | రా6-33,, | రా8 -46,, | రా10-54,, | రా12-47,, | తె2-27,, | తె4- 4,, |
| 10-5-36 | ఉ5-44,, | ఉ7-42,, | ప9 -52,, | ప12- 5,, | సా2-13,, | సా4-19,, | రా6-29,, | రా8 -42,, | రా10-50,, | రా12-43,, | తె2-23,, | తె4- 0,, |
| 11-5-36 | ఉ5-40,, | ఉ7-38,, | ప9 -48,, | ప12- 1,, | సా2- 9,, | సా4-15,, | రా6-25,, | రా8 -38,, | రా10-46,, | రా12-39,, | తె2-19,, | తె3-56,, |
| 12-5-36 | ఉ5-36,, | ఉ7-34,, | ప9 -44,, | ప11-57,, | సా2- 5,, | సా4-11,, | రా6-21,, | రా8 -34,, | రా10-42,, | రా12-35,, | తె2-15,, | తె3-52,, |
| 13-5-36 | ఉ5-32,, | ఉ7-31,, | ప9 -41,, | ప11-54,, | సా2- 2,, | సా4- 8,, | రా6-18,, | రా8 -31,, | రా10-39,, | రా12.32,, | తె2 12,, | తె3-49,, |

# జ్యోతిష విమర్శనము

జ్యోతిషయను యొక మాసపత్రిక శ్రీ॥ శ్రీ॥ శ్రీయుత లంక పార్వతీశశాస్త్రిగారు తెనాలి పట్టణమునుండి నడపిరి. ప్రథమ సంపుటమున ప్రథమ సంచికయందు ప్రథమ వ్యాసమున సాముద్రికశాస్త్రము అను శీర్షికతో నిట్లు వ్రాసిరి.

"కొందఱు బైరాగులు సన్యాసులు చేతులనుచూచి ఫలములను చెప్పుచున్నారు. కొన్ని సరిగానగుచున్నవి. కొన్ని విఫలములగుచున్నవి. కారణమును విచారింపవలెను. వారు కేవలము సమర్థులనిగాని యసమర్థులనిగాని యనకూడదు. సాముద్రికమను శాస్త్రమొకటి గలదు. దీనివలన మనపూర్వులబుద్ధివిశేషము తెలియనగును. దీనిని మన జాతకంబునుచూచి దైవజ్ఞుడు వారు చేయు మంచిచెడ్డలను నిర్ణయించి చెప్పినట్లు శరీరంబు ననుసరించి సాముద్రిక శాస్త్రజ్ఞుడు చెప్పును......హస్తంబున నొక మంచి రేఖ యుండవచ్చును. పాదంబున దానికివ్యతిరేకంబుగా నుండును. ముఖంబున నొక సుడి యుండును. దానికి భిన్నముగా మరియొక చక్రము ముడ్డి నుండవచ్చును"

ప్రవేశములేని శాస్త్రమునుగూర్చి పండితుడగువాడు మాట్లాడుట కడుంగడు అయుక్తమైన విషయము. ఈ వ్రాతలవలన వీరి సాముద్రిక శాస్త్ర పరిశీలనాశక్తి యగపడుచున్నది. ఒక పామరునికిని ఈపండితునకునుగల తారతమ్యము నాకగపడదు. వీరివ్రాత గోడమీద పిల్లికూర్చుడుట వంటిది. వీరి జాతకశాస్త్ర విమర్శనలుకూడ ఇటులే యుండవచ్చునని నేను తలచుచున్నాను.

నాడీగ్రంథ రాజములనుండి హస్తపరిశీలన మొనర్చి జాతకచక్రములు నిచ్చుట వీరు వినియుండలేదు గాబోలు. ఇదివరకే శ్లోకాత్మకమైయుండుజాతక శాస్త్ర మభ్యసించి చిలుక యొప్పగించుమాదిరి పలుకు లప్పగించుటగాదు సాముద్రికశాస్త్ర మనిన.

ఈ వ్యాసమునుగూర్చి ప్రత్యేకముగా రాబోవు పత్రికా సంచికలయందు వాక్యార్థము చేయుచు శాస్త్రసత్యమును నిరూపింతును. నేచేయబోవు విపులవిమర్శనము ఈ వాక్యముల మీదనుగాక యిట్టి భావములబొందు ప్రతి వ్యక్తిని సూటిగా జెందును. సాముద్రిక శాస్త్ర మనినతోడనే ముందు బైరాగులు సన్యాసులు బయలు దేరుదురు. తదుపరి తప్పనిసరిగ ముడ్డి క్రింద, మీద, లోన, యను శబ్దరాజములు ప్రతివాని మనస్సునకును తట్టును. వీరి వ్రాతల వలన సాముద్రిక శాస్త్రమునకును ముడ్డికిని యవినాభావసంబంధ మున్నట్లుచూపట్టుచున్నది. గృహస్థులు ఈ శాస్త్రమున కర్హులుకారా? ఏల యర్హులు కాజాలరో శాస్త్రిగారు వ్రాయించలేదు. కొన్ని ఫలంబులు విఫలంబులగుచున్నవి యని వ్రాసి వారు సమర్థులనిగాని యసమర్థులనిగాని యనగూడదని శాసించుచు "సాముద్రిక"మనునది యొక శాస్త్రమని మాత్రము తలంచుచున్నారు. ఇటువంటివారి వ్రాతలవలన బ్రహ్మవ్రాతను సూచించుచుండు నంతటి మహాశాస్త్రము సూక్ష్మరూపమున ప్రజాహృదయములయందు పొందుచుండుట కడుంగడు శోచనీయము.

# ఫలనిర్ణయము

ఈ దిగువ నిచ్చిన హస్తముద్రినుగూర్చి నే నీక్రింది విధముగా ఫలములను చెప్పియుంటిని. ఈ వ్యక్తి ఒక చిన్న గ్రామమునందలి సామాన్యమైన పేద కుటుంబమునందు జననమొందెను.

పిత్రియమగు చిన్నగృహముండెను. ఈ జాతకుని కుటుంబ పెద్దలు వేదవిద్యా సాంప్రదాయమువలన జీవించిరి. ముగ్గురు సోదరులు ఇద్దరు సోదరీలు జీవించియుందురు. షుమారు 6-7 సం॥ మధ్య నొక సోదరీ భర్త మరణము. 10 సం॥ వరకునుగూడ పేదరికమే. 9 సం॥న తండ్రిగారి మరణము. 10 సం॥న జ్యేష్ఠ సోదరుడు కుటుంబమునుండి విడిపోయెను. 10 సం॥న స్థానచలమును కలిగెను. 11 మొదలు 13 వరకును ఈ జాతకు డన్యుల సాయముచే జీవించుచు చదువుకొనుచుండెను. 12-13 సం॥ మధ్య ఒక పెద్ద మనిషి ఆదరణ ప్రారంభమాయెను. చదువు సక్రమముగా జరుగుచుండెను. ప్రాణ భాషావిద్య 18-19 సం॥ వరకు జరిగి భంగమై 20 లోపుగ విరమింపబడెను. 20 సం॥ వరకును నిరుపేదరికమునే చెప్పవలసియుండును. వీరి జీవితమునందు వీరి కర్మకు సంబంధించిన మరియొక జీవిత చరిత్ర తెలియుచున్నది. షుమారు 11-12 సం॥ యందు ఒక పెద్దవారి ఆశ్రయము సంప్రాప్తించెను. వారి జీవితమునుగూర్చి వీరి కర్మకు సంబంధించినవరకు దిగువున వ్రాయబడుచున్నది.



వీరికి వారి ఆశ్రయము దొరికినది మొదలు ఆ పెద్దమనిషి విశేషముగ శుభకాలమునుబొంది యుండెను. వీరి షుమారు 18 సం॥న ఆ పెద్దమనిషికి ప్రథమకళత్రము నష్టమగుటయు ద్వితీయకళత్ర ప్రాప్తియు గలిగెను. వీరి 18 నుండి 25 వరకును ఆయనకు వ్యవహార వర్తకములయందు విశేష లాభము కలుగుచుండెను. 25 సం॥న నొక వర్తక సంబంధమైన సంస్థ (business firm) ప్రాప్తించినది. తద్వారా పేరు విశేషలాభము కలుగుచుండెను. మరల ఆయనకు వీరి 27 వ సం॥ నందు ద్వితీయ కళత్రము నష్టము. మరల తృతీయ కళత్రము ప్రాప్తికలిగినది. బిడ్డలు కలిగిరి. వీరి 32-33 సం॥రములయందు వారు మరల వర్తకమును స్థాపించి ద్రవ్యమును నార్జించుచున్నారు. ఆయనకు పుత్ర పుత్రికా సంతానమున్నది. ఇక యీ జాతకుని చరిత్రనుగూర్చి స్వల్పముగ సూచించుచున్నాను.

వీరికి 23 సం॥ వివాహము జరిగెను. 28 వ సం॥న స్త్రీ సంతానము కలిగెను. మరల 31 వ సం॥న స్త్రీ సంతానము కలిగెను. 33 సం॥న సోదరికి వైధవ్యము ప్రాప్తించెను. వీరికి ఉద్యోగ వృత్తియందు అస్వస్థతకలిగెను. స్వల్పముగ స్థిరాస్తిని సంపాదించిరి. గ్రంథ విస్తరభీతిచేత మరికొన్ని విషయముల నిచ్చట లోపింపజేయవలసి వచ్చినది. ఈ వ్యక్తి నివాసస్థలము విశాఖపట్టణము జిల్లా. ముందు రాబోవుసంచికలయందు విచిత్రములగు జీవితచరిత్రలుగల వారి హస్తముద్రలు ఫలసహితముగ ప్రకటింపబడుచుండును. చిత్రగాథలన్నియు ఆత్మరేఖనుండి చెప్పవలసియుండును.

ఇది ఒకవ్యక్తియొక్క జాతకము. దీనినిబట్టి ఫలములను విమర్శించి మాపత్రికాకార్యాలయమునకు పంపినచో ఎవరి ఫలము అనుభవముగ నుండునో వారికి బహుమాన మీయబడును.

జననకాలము: శుభకృతునామ సంవత్సరం మాసం వైశాఖం, పక్షం శుక్లము, తిథి చవితి, ఆదివారం చవితి భానువాసరం 32-32 ఆర్ద్ర 51 12 పూర్వేద్యుః మృగశీర్ష 55-8, 1902 మే నెల 11 వ తేది పగలు 11 గం 14 ని. లకు జననం.

సూర్యోదయాది జననకాల ఘటికావిఘటికాః ౧౪-

| | |
|---|---|
| భుక్తభోగ్యాంతం | ౫౬-౪ |
| పాదప్రమాణం | ౧౪-౧ |
| ద్వితీయ పాదభుక్తి | ౪-౫౧ |
| నక్షత్రశేషం | ౩౮-౧౨ |
| జననకాలిక కర్కాటకలగ్న శేషం | ౧.౩౯ |

అథ రవ్యాది గ్రహసంపత్తి

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృత్తికా | ౧ | రవిః | ఉ॥భా॥ | 3 | శుక్రః |
| ఆర్ద్రా | ౨ | చంద్రః | ఉ॥షా॥ | 3 | శనిః |
| భరణీ | ౧ | కుజః | స్వాతీ | ౨ | రాహుః |
| రోహిణీ | ౧ | బుధః | అశ్వనీ | ౪ | కేతుః |
| ధనిష్టా | ౧ | గురుః | | | |

జనకాల రాహుమహాదశాశేషం 11 సంవత్సరముల 11 మాసముల 10 రోజులు.

| | | | |
|---|---|---|---|
| శు 9 | ర-కు-కే-10 | 11 బు | గు చ |
| 8 | రాశిచక్రం | | 1 ల |
| 7 గు-శ | | | 2 |
| 6 | 5 | 4-రా | 3 |

షరా:— ఇది సవ్యచక్రము. సవ్యాపసవ్య భేదము లుండుటవలన రాసిచక్రమునందు 1 కర్కాటకము. 1 నుండి12 వరకు మిగత రాసులను గ్రహించుకొనవలసి యుండును.

| | | | |
|---|---|---|---|
| | బు | | |
| శ | అంశచక్రం | | కే |
| చ రా | | | కు గు |
| ర | | శు | |

# దశావివరములు

| | | | | |
|---|---|---|---|---|
| కృత్తిక, | ఉత్తర, | ఉ॥షాఢ | సూర్యదశ | - 6 సం॥ |
| రోహిణి, | హస్త, | శ్రవణం | చంద్రదశ | -10 సం॥ |
| మృగశిర, | చిత్త, | ధనిష్ట | కుజదశ | - 7 సం॥ |
| ఆర్ద్ర, | స్వాతి, | శతభిష | రాహుదశ | -18 సం॥ |
| పునర్వసు, | విశాఖ, | పూ॥భాద్ర | గురుదశ | -16 సం॥ |
| పుష్యమి, | అనూరాధ, | ఉ॥భాద్ర | శనిదశ | -19 సం॥ |
| ఆశ్లేష, | జ్యేష్ట, | రేవతి | బుధదశ | -17 సం॥ |
| అశ్వని, | మఘ, | మూల | కేతుదశ | - 7 సం॥ |
| భరణి, | పుబ్బ. | పూర్వాషాఢ | శుక్రదశ | -20 సం॥ |

పైనుదహరించిన విషయములనుబట్టి ఎవనికైనను యొక సంతానము గల్గినచో జననకాలమునుబట్టి గడియారమును జూచి ఏలగ్నమైనదియు ఏనక్షత్రమైనదియు ఏమహాదశ జరుగుచున్నదియు, ఏరాసులయందు ఏయేగ్రహములున్నదియు జ్యోతిష్కుని సహాయములేకుండగనే స్థూలదృష్ట్యా తెలుసుకొనుటకు వీలగును.

| | మార్చి, | | ఏప్రియల్. | | |
|---|---|---|---|---|---|
| గ్రహములు | 18 | 28 | 7 | 12 | 22 |
| కుజుడు | 356-1 | 3-8 | 11-0 | 14-9 | 22-1 |
| బుధుడు | 316-3 | 334-3 | 353 0 | 2-7 | 20 8 |
| గురుడు | 240-4 | 241-1 | 241-3 | 241-3 | 241-3 |
| శుక్రుడు | 308-2 | 320-5 | 332-8 | 339-3 | 351-6 |
| శని | 319-4 | 320-6 | 321-9 | 322-5 | 323 5 |

ఇది స్వామికన్నువారిచే రచింపబడిన పంచాంగము జాతక మనెడిగ్రంథమునుండి ఇచ్చట నుదహరింపబడినది.






## దీని ప్రాశస్త్యము

ప్రస్తుతవ్యాసమున జ్యోతిష సాముద్రిక శాస్త్రములకుగల సంబంధమును చర్చించి యీ యుభయశాస్త్రములయందు ఏశాస్త్రము సర్వజనోపకారిగా నుండి ప్రాముఖ్యమును వహించునో విచారింపవలసియున్నది. ఇవి క్రీస్తు శకమునకు బూర్వము కొన్ని వేల సంవత్సరముల నుండి గొప్ప యనుభవశాస్త్రములుగ భారత భూమియందు విరాజిల్లుచున్నవి.

కాలక్రమమున ప్రభుత్వపు మార్పులు కొన్ని కల్గియుండుటవలన నివి క్రమేణ జనసామాన్యము యొక్క నిరాదరణకు పాలైనవి. కాని యీయిరువదియవశతాబ్దమున పాశ్చాత్యసభ్యత ననుసరించుచుండు హైందవ ప్రజాళియం దీ శాస్త్రములను గూర్చిన విపరీత వింతభావములు పొడముచున్నతరి పాశ్చాత్యులచే రచింపబడిన జ్యోతిష సాముద్రిక గ్రంథములు భరతఖండమున ప్రవేశపెట్టబడినతోడనే ప్రస్తుతనాగరికతా ప్రపంచముయొక్క దృక్పథము మారిపోయినది. విన్నన్న చెప్పినదే వేదమనినట్లును, శంఖమున బోసినగాని తీర్థముగానట్లును, పాశ్చాత్య పండితు లీ శాస్త్రములను శ్లాఘించి గ్రంథములనువ్రాసి మనభారతీయప్రజ కంద జేసినగాని యీశాస్త్రములయందు మనవారికి విశ్వాసమును ఆదరణయు కలుగలేదు. నేడాంగ్ల విద్యాభ్యాసకుల హస్తములను పాశ్చాత్యుల వలన రచింపబడిన సాముద్రికగ్రంథము లలంకరించుట మనదేశమున లోకవిదితము. శుభావహము. ఈగ్రంథములు మిగుల శైశవావస్థ యందున్నను ఆదరణీయము లగుచున్నవి. ఇట్లే పాశ్చాత్యపండితులచే రచింపబడిన జ్యోతిర్గ్రంథము లాంగ్లభాష నభ్యసించిన భారతీయుల వలన సగౌరవముగ సమ్మతింపబడుచున్నవి.

ప్రస్తుతము జ్యోతిష సాముద్రిక శాస్త్రములకుగల సంబంధము గ్రహము లగుచున్నవి. గ్రహములయొక్క బలాబలము లనగా ఉచ్ఛనీచావస్థలు, గ్రహసమ్మేళనములు, గతులు, వాటిస్థితులు, వాటికిగల పరస్పరసంబంధము లీశాస్త్రములకు ప్రధానములగుచున్నవి. కొందఱి మతము ననుసరించి, సాముద్రిక శాస్త్రము వేరును, జ్యోతిశ్శాస్త్రము వేరును గావు. ఉభయ శాస్త్రసూత్రములు నొక్కటై యున్నవి. మానవు డుదయించిన జన్మలగ్నమును, తత్సంబంధమైన రాశిచక్రము నంతయు, ఈశ్వరుడను మహా జ్యోతిష్కునిచే లిఖింపబడి హస్తగతమై యున్నది. జ్యోతిశ్శాస్త్రపండితులు జ్యోతిర్గణితములమీద నాధారపడియు, జాతకుడిచ్చు జనన కాలఘడియలమీద నాధారపడియు, జన్మకుండలిని నిర్మించుచుందురు. హస్తము ఈశ్వర లిఖితము, జాతకము మానవలిఖితము అందురు.

లోకమున నుద్భవించు ప్రతివ్యక్తికిని జాతకమును లిఖించు బాధ్యత యీశ్వరునిదై యుండుట వలన హస్తమున రేఖాభాషను సృజించి యందు మానవుని జాతక చక్రమును, జీవిత చరిత్రయు కూడ నిర్మించెను. ఈశ్వరసృష్టి యీశ్వరోద్దేశము సర్వదా సంపూర్ణములు. జన్మజాతక చక్రము మానవబుద్ధి కల్పితమైయుండుటవల-

మానవుని బుద్ధివిశేషము అసంపూర్ణముగావునను, ఈశ్వరలిఖితమైన హస్తమునకు ప్రాముఖ్యము నొసంగవలసియున్నది.

ప్రతి వ్యక్తికిని జాతకములుండక, కొందిజనమునకు జాతకములుండును. జాతకములులేనివారి కదృష్టమును తెలిసికొను సాధనము సాముద్రిక శాస్త్రము. మన యాంధ్రదేశమున పూర్వము నుండియు ఈ శాస్త్రమునకు గౌరవస్థానమీయబడినదనిగాని, యీ శాస్త్రవ్యాసంగము చేయబడినదనిగాని ఋజువు చేయుటకు నిదర్శనములు గానరాకున్నవి. హిందూదేశమున తదితర భాగములయందు సాముద్రికశాస్త్ర గ్రంథములు, నానావిధములగు నాడీగ్రంథములు మొదలుగాగల నిదర్శనములు పెక్కులుగలవు.

ఈ శాస్త్రాధారముచే ఈశ్వర రచితమైన హస్తరేఖలనుబట్టి ఫలములు ఋజువుగా చెప్పుటకు వీలగును. యోగాయోగములు, లాభాలాభములు, శుభాశుభములు, సూచించుచుండు రేఖలు కంటి కగపడుచుండుటనుబట్టి సులభముగను నిదర్శనముగను బహుసూక్ష్మముగను చెప్ప వీలగుచున్నది. ఒకతీరు హస్తములును ఒకతీరు రేఖలును మరి యెచ్చటను కానరాకుండుటనుబట్టి సందేహములుండవు. ఇక జ్యోతిశ్శాస్త్రముననో నిరాయన, సాయన పద్ధతులు గలవు. ఒక పద్ధతినిబట్టి మేషలగ్నముగను, మరియొక పద్ధతినిబట్టి వృషభలగ్నముగను దేలుచుండును. చాంద్రమానము సౌరమానము మొదలగు భేదములెన్నియో పొడముచున్నవి. జ్యోతిశ్శాస్త్రమునందు నాయుర్దాయసంవత్సరములనుగూర్చి వింశోత్తరీమార్గ మొకటియు, అష్టోత్తరీమార్గము మరియొకటియు గలవు. చతురసీతి దశాక్రమము మను మూడవపద్ధతియు గలదు. రెండవ పద్ధతి పశ్చిమోత్తరహిందూస్థానములయందు ప్రబలియున్నది. పాశ్చాత్యఖండములయందు వింశోత్తరీగాని అష్టోత్తరీగాని చతురసీతిగాని యనలుకాన్పించవు. ఇతరతరగతులగు ననేక భేదములుకూడ గలవు. అన్నిటియందును ముఖ్యమైనవి లగ్నప్రమాణములు. లగ్నప్రమాణములయందు ఒక దేశమునకును మరియొక దేశమునకును వ్యత్యాసము లగుపడుచున్నవి. ఒకమతమును బట్టి మేషలగ్నము మొదలు కొన్నిలగ్నముల వరకును లెక్కించినచో నొకలగ్నమును మరియొక పద్ధతినిబట్టి లెక్కించినచో మరియొకలగ్నమును వచ్చుచుండును. ఇట్టిసమయముల యందు ఏపద్ధతి సర్వోత్తమమో తెలుసుకొనుట కష్టతరము. లగ్నభేదములు గలుగుచుండుటవలన ఫలములను నిరూపించుట కష్టముగానుండును. ఇది యిట్లుండ పంచాంగముల యందు సహితము పెక్కు దుస్థితులు గనపడుచున్నవి. ఒకపంచాంగమునుబట్టి యొకరోజున ఒకనక్షత్రము 13-50 విఘడియల కాలము సూర్యోదయమునుండి యుండునట్లు చూపుచుండ మరియొక పంచాంగము అదేనక్షత్రము అదేరోజున 12-25 విఘడియలు సూర్యోదయమునుండి యుండునట్లు చూపును. మరియొక పంచాగమున అదేరోజున అదే నక్షత్రము 11-55 విఘడియలున్నట్లు చూపును వీటినిబట్టి దశాసంవత్సరములు భేదించుచుండును. ఈమూడు పద్ధతులయందు ఏపద్ధతి న్యాయమో శాస్త్రసమ్మతమో కనుగొనవలసివచ్చినచో కష్టమగుచుండును, లేదా జాతకమును వ్రాయబోవు జ్యోతిష్కుడు వ్రాయుచున్న జాతకమును గట్టిపెట్టి తానుస్వతంత్రముగా పంచాంగమును గుణించి నిగ్గు తేల్చుకొనవలసియుండును. లేదా జాతకుని సంతోషపెట్టుటకు ఏలగ్నము ఏనక్షత్రము బాగుండునో దానిని గ్రహించి వ్రాయవలసియుండును. ఒకే సమయమున నల్గురైదుగురు (అనగా ఒకలగ్నమున) వివిధరాజకుటుంబముల యందును అదే లగ్నమున మరికొంతమంది జాతకు లుద్భవించుచుందురు. నిరుపేద కుటుంబములయందు కొంత

మందియు శ్రీమంతుల కుటుంబములయందు మరికొంతమందియు అదేలగ్నమున జన్మింతురు. లగ్నము ఒకటైగ్రహములయందు సహితము భేదములేనియడల రాజకుటుంబముల యందు జన్మించిన శిశువులకును, శ్రీమంతులకుటుంబములయందు జన్మించిన శిశువులకును, నిరుపేద కుటుంబములయందు జన్మించిన శిశువులకును జీవితచరిత్రమంతయు నొకటై యుండవలసి యుండును. కాని యనుభవమునకు విరుద్ధముగ నుండునట్లు గాంచుచున్నాము. ఈభేదములకు గారణము లేమైయుండును? ఏకలగ్నగతులైనను ఈ శిశువులందరును వివిధసూక్ష్మ కాలములయందు జన్మించుటచే విభిన్నతరగతులగు జీవిత చరిత్రలను పొందుచుందురని కారణములు చెప్పి దాటుట కవకాశముగలదు. కాని యిట్టి భేదములులేక యుండు జాతకములనుగూర్చి ప్రశ్న జనించినది. ఒక సుముహూర్తమున నల్గురైదుగురు గర్భిణీస్త్రీలు ఒకజిల్లా యందుండియు ఏకకాలమున నొక వైద్యశాలయందు ప్రసవించిరి. వారిలోనిద్దరు మాత్రము కవల పిల్లలను కనుట సంభవించెను. ఒక స్త్రీకి జన్మించిన మొదటి కవల శిశువుయొక్క జన్మకాలము మరియొక స్త్రీ ప్రసవించిన ద్వితీయ కవలశిశువుదయించిన కాలము సరిగాయున్నవి. వీరిద్దఱి జన్మకాలమునకును ఆవంతయును భేదములేక యున్నది. ఇందు ఒకశిశువు మరణించుటకును మరియొకశిశు వింతవరకును జీవించియుండుటకును జ్యోతిశ్శాస్త్రపండితులే సమాధాన మీయవలసియుండును? నిముషమాత్రమైనను భేదములేదు. లవమాత్రము కాలభేదములేనితరి ఒకే జాతకసంబంధమగుఫలము లిట్లుభేదములను భిన్నములను పొందుటకు గారణ మేమైయుండును? వారియుభయుల జన్మకాలము 8-10 నిముషములు. ఒకరి జాతకమునకు రాబడు సూక్ష్మాంశములు మరియొకజాతకమునకు సహితము రావలసినదేగదా. కాలసూక్ష్మములు వీటికి గారణములగు చుండును. ఇట్టి యతిసూక్ష్మములగు నంశములను జ్యోతిశ్శాస్త్రము చూపుచుండుట లేదు.

[సశేషము.

# ముఖవైఖరీ శాస్త్రము

మానవదేహము నంతయు శాస్త్రదృష్టిని విమర్శించి చూచినచో, వాని జీవితవృత్తాంతమంతయు వానిహస్తములయందును, వాని ముఖమునందును సంపూర్ణముగ గోచరించు చుండును. దేహియొక్క జీవితమంతయు రేఖాభాషను హస్తములయందు వ్రాయబడియుండును. కాని ప్రతిమనుజునకును తన హస్తములనెడి పుస్తకములను చూచి చదువుట కవకాశముండక పోవచ్చును. హస్తములయందే జీవితచరిత్ర వ్రాయబడియుండునో యదే జీవితము వాని ముఖసీమయందతిస్పష్టముగ నిమిడ్చియుండును. సమస్తకళలు, జీవితచరిత్రము, భావపటిమ, గుణగణములు, ముఖమున నతిమనోహరముగ సమర్చబడియుండు వివిధజ్ఞానేంద్రియముల ద్వారా ప్రకటింపబడుచుండును. ఏమహాకవియు, ఏశిల్పశాస్త్రవేత్తయు చూపింపలేని కళాజాలములను, జీవభావములను, మంజులతా సహజముగ ముఖమున చిత్రింపబడియుండును. ముఖబింబమునుండి వివిధజ్ఞానేంద్రియములు వివిధములగు మానవ గుణ చరిత్రాతిశయములను, వివిధములగు ననేక రహస్యములను చూపరులకు ప్రకటించును. దేహసృష్టి భావరహస్యమంతయు, ముఖము గోచరింపజేయును. ఒకని ముఖము ఆతనినేత్రయుగ్మము ద్వారా పరాక్రమాగ్నిని వెదజల్లుచు

లోకములను కంపింపజేయురీతిని ప్రకాశించుచుండును.

ఆపరాక్రమాగ్నికి తగురీతిని నాసికాంగము మహాసహానశక్తిని, నిర్మలమగు నుదారగుణములను, మహాధైర్యమును చూపుచుండును.



మానవజాతికంతయు, నాసికా నేత్రములు, ఒకేస్థానమునను, ఒకేరీతిని యుండియు, వివిధ స్వరూపభేదములను పొంది వివిధములగు గుణముల నిచ్చుచున్నవి. ఒక మానవుని నేత్రములకును మరియొకని నేత్రములకును భేదముండుటను బట్టి యొకని గుణస్వభావాదులకును యదృష్టములకును, మరియొకని యదృష్టగుణస్వభావాదులకును తప్పక భేదము లగపడుచున్నవి. ముఖమున కలంకారములగు ముక్కు, పెదవులు, చెవులు, కనుబొమ్మలు, లలాటభాగము, చుబుకము (గడ్డము), మీసములు, దవడలు, చెక్కిళ్లభాగము, నేత్రములు, పలువరుస, బొమముడి, కంటిరెప్పలు మొదలగు ముఖ్యభాగములే తీరుననుండిన నేయేఫలములు ఏయేకాలములయం దనుభవింతురో విపులముగ ప్రతిసంచికయందును సచిత్రోదాహరణయుక్తముగ వ్రాయబడుచుండును. ముఖవైఖరీశాస్త్రమును గూర్చి పాశ్చాత్యదేశములయం దనేకపండితులు కొన్ని వందల గ్రంథములను వ్రాసిరి. కాని వారిశాస్త్రగ్రంథములన్నియు భిన్నాభిప్రాయములు లేక యొకేవాదమునుసూచించుచుండును. ఒక అవయవము నుండి కలుగుచుండు సుగుణ దుర్గుణములు మరియొక యవయవస్ఫూర్తివలన కొట్టుబాటగుచుండునని వ్రాయుట కడు యసమంజసము. దైవకర్మ సూచితమగు ముఖాంగములు స్థిరములుగను, సంపూర్ణములుగను, ఈశ్వరోద్దేశసహితములుగను నిర్మింపబడి యుండును. పరిపూర్ణములైన యీశ్వర సృష్టిరహస్యములను ఒక యసంపూర్ణుడైన మానవుడు విమర్శింప నర్హుడు కాజాలడు. దైవ సృష్టియందుండు ప్రతివస్తు నిర్మాణమున కొక యీశ్వరోద్దేశముగలదు. ఇట్టియుద్దేశము మానవు డూహింపలేనిమూలమునను ఆతనియం దజ్ఞానము ప్రబలియుండుట వలనను తనజీవిత స్థితినిబట్టియు తనమానసికాభిరుచి దౌర్బల్యములనుబట్టియు తనకుతోచిన యనుచిత వ్రాతలు వ్రాయుచుండును.



ముఖావయవములయం దొక యంగమును పురస్కరించుకొని మరియొకయంగ ముండును గాని, యొకదానికి భిన్నముగ మరియొకటి యెన్నటికిని యుండదు. ఇట్లుండుటవలన కర్మను సూచించుచుండు ఈశ్వరభావము చెడును.

ముఖబింబము నంతయు నొక రాశి(జన్మలగ్న) చక్రముగ నెంచవలసియుండును. ముఖబింబమును ద్వాదశరాశ్యాత్మకచక్రమందు నవగ్రహములును ఇరువదియేడు నక్షత్రములును వివిధ ముఖాంగముల యందు వివిధస్థానములను పొంది యున్నవి. ఈ యంగములయొక్క వివిధావస్థలు గ్రహములయొక్క స్థితిసమ్మేళనములను శుభాశుభత్వములను దెల్పుచుండును.

ముఖభాగములుముఖాంగములు ముఖవైఖరీ విద్యకు ప్రధానములు. ఒకొక్క ముఖావయవ వైఖరినుండి యొకక్కొ జీవితభాగము ప్రకటింపబడుచుండును.

1 కపాలభాగము 2 ఫాలభాగము 3 కనుబొమ్మలు 4 నేత్రములు 5 నాసిక 6 నాసికకును అధరమునకు పైభాగము 7 ముఖబిలము 8 కర్ణములు 9 చుబుకము (గడ్డము) 10 చెక్కిళ్లు లేక చెంపలు 11 కణతలు 12 బొమముడి. ఈ యంగములు ద్వాదశ జీవిత భావములను తెల్పుచుండును. ఈ పదు రెండు అవయవములయం దే యవయవము మిక్కిలి యభివృద్ధినిజెంది యుండునో యాజీవిత భాగమున గొప్ప యదృష్టము యుచ్చస్థితిని కల్గుచుండును.

ఇం దే యవయవములు ఏయేకారకత్వములను గుణస్వభావాదులను చూపుచుండునో జ్యోతిష సాముద్రికాంగ వైఖరీశాస్త్రముల సమ్మతముగ ఈదిగువను వ్రాయుచున్నారము.

కపాలభాగము:—దేహారోగ్యము,ఆయుర్దాయము, వ్యక్తిత్వము, కీర్తి మొదలగు దేహమునకు జెందు ఫలములన్నియు తెల్పును. నెన్నుదురు ఎత్తుగా నుండి కపాలము విశాలముగను నలుచదరముగను కపాలములోని పెంకు సామాన్యదళసరిని పొందియున్నచో దీర్ఘాయుర్దాయవంతుడగును. ఇట్లున్న వారికి చెవులు పెద్దవిగా నుండును. చెవులు పెద్దవిగానున్నచో మరణము సుఖకరమైనదని చెప్పవలయును. స్వగృహమున తన కుటుంబ జన మధ్యమున నా మానవుడు నిర్యాణమును పొందును. కపాలమున రెండు రోమ ముద్రలు (రోమసుడులు) ఉన్నచో సుఖజీవియగును. కాని కష్టమైన మరణముగాని, రోగబాధగాని పొందును. నాల్గు రోమసుడులున్నచో యతీశ్వరుడగును. కపాలము అందుండు రోమముల మృదుత్వ కాఠిన్యములను బట్టియు, నెన్నుదురు తీర్పులనుబట్టియు, రోమసుదాభాగములు, వాటి సవ్యాపసవ్యములను బట్టియు యాయుర్దాయనిర్ణయమును చేయవలసి యుండును. ప్రతిమానమునను ఒక్కొక్క యవయవమునుబట్టి పూర్ణవివరములతో చిత్రపటములతో సహితము వ్రాయబడుచుండును.

## హస్తశాస్త్రము

ప్రస్తుతవ్యాసమునందు హస్తశాస్త్రమును గూర్చి విచారింపవలసియున్నది. హస్తశాస్త్ర విచారమనగదైవసృష్టిమర్మవిచారముగ భావింపవలసియుండును. హస్తవిమర్శనము సాముద్రిక శాస్త్రమునకు ప్రధానవిషయము గాన హస్త శాస్త్రమును గూర్చి తొలుదొల్త విచారింపవలసి యున్నది. హస్తమే ఈ శాస్త్రమునకంతయు ముఖ్యాధారముగ రాజిల్లుచుండును. హస్తముయొక్క పోలికలను బట్టియు, అరచేయియొక్క దళసరి పలచదనములను బట్టియు, వ్రేళ్లు వాటియొక్కపోలికలను బట్టియు, హస్తములకు సంబంధించిన ఇతరవిషయములనుగూర్చియుబోధించునదంతయు హస్తశాస్త్రమనబడును. సాముద్రిక శాస్త్రభాగములన్నిటియందును ఇది మిగుల కఠినమైనభాగముగ చూపట్టుచుండును. ఈ శాస్త్రము

సాముద్రికశాస్త్ర పరిచయమ్మునకు సింహద్వారముగ నెంచవలసియున్నది సాముద్రికశాస్త్రమున కంతయు హస్తశాస్త్ర మాధారభూతమైనను పాశ్చాత్యసాముద్రికశాస్త్రవేత్తలంతగా దానిని పాటించనట్లు వారి శాస్త్రములనుండి తేలుచున్నది. వివిధపాశ్చాత్య పండితసోదరులు వివిధవిధములుగ వ్రాసిరి. తొలుదొల్త హస్తవిభాగక్రమమునుగూర్చి కొందరు 5 తరగతులుగను కొంద 6 తరగతులుగను, కొందరు 7 తరగతులుగనుభాగించి, వారలకు దోచినరీతిని వ్రాసియుండిరి. ప్రారంభమున భావప్రవణిక హస్తముగను (idealistic hand) వాస్తవిక హస్తముగను (realistic hand) వేదాంత హస్తముగను, (philosophical hand) వ్రేళ్ళ చివర మొద్దుబారియుండు హస్తముగను, (spatulate hand)



మిశ్రమహస్తముగను (mixed hand) భాగించిరి. పాశ్చాత్యసాముద్రికశాస్త్రపండితులలో కొందరు హస్తకబంధము (వ్రేళ్ళులేకుండు మొండెము)లను బట్టియే హస్తవిభాగమును గావించిరి. వారలలో మఱికొందరు వ్రేళ్లయొక్క రూపములను బట్టియు వాటియగ్రభాగములను బట్టియు హస్తవిభాగమొనర్చిరి. వారుఉభయులును గూడ హస్తముయొక్క భాగములను మాత్రమే గ్రహించి హస్త



విభాగ క్రమమును చేయుట శాస్త్ర సత్యమునకు దూరముగనున్నది.

ప్రస్తుతవ్యాసమున పాశ్చాత్యులకు సంబంధించు భావములుగాని వారిశాస్త్రరీతులుగాని వ్రాయక నే నీశాస్త్రమునందు బహుకాలము కృషిచేసి సంపాదించిన నాయనుభవజ్ఞానముచేతను జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానముతోడను హస్తవిభాగవిధానమునుగూర్చి శాస్త్రాధారములతోడను వేదప్రమాణ్యములతోడను జ్యోతిషసిద్ధాంతశాస్త్రసూత్రముల సహాయమువలనను వ్రాయుచున్నాను. పాశ్చాత్యులు వెలిబుచ్చురీతి మనము మనకుదోచిన ప్రకారము హస్తవిభాగమొనర్చిన శాస్త్రమునకు బుట్టినిల్లగు మనహిందూదేశమున సమ్మతింప బడదు. హస్తములన్నియు పోలికలనుబట్టి యొకేమాదిరిగ నుండుట సామాన్యపద్ధతి. హస్తయులన్నియు

నొకేమాదిరి పోలికలను పొందియున్నను ఒకేజాతికి జెందక వివిధజాతులకు చెందియుండును. ముఖములెన్నటికిని ఒకేమాదిరిగ నుండనట్లు ఒకేమాదిరిగ హస్తములుకూడనుండవు. సూక్ష్మదృష్టితోడను శాస్త్రదృష్టితోడను విచారించినచో పెక్కు భేదములు కన్పించును. ఇందుమూలమున మానవుల మానసికాభిరుచులుగూడ భేదించుచుండును.

సృష్టిజాలమంతయు నవగ్రహములచే పరిపాలింపబడుచున్నది. అట్టిచో మానవుని జీవితముకూడగ్రహపరిపాలితమని వేరేవచియింప నవసరములేదు. గ్రహమునకొక తరగతి కారకత్వముండును. ఇట్లే నవగ్రహములకు నవవిధకారకత్వములుండును. ప్రతిమానవుడును వాని మానసికాభిరుచులను తప్పక బలిష్టమైన గ్రహముచే పరిపాలింప బడుచుండును ఇతర గ్రహములయొక్క బలములు కొంతవరకు సంక్రమించియున్నను మొత్తంమీదఒకగ్రహమునకు మాత్రము సంపూర్ణ పరిపాలనాధికార ముండును. వీటినిబట్టి మానవునియొక్క మానసికాభిరుచులు మారుచుండును. 9 జాతులుగ హస్తములు విభాగింపబడుటకు నవ గ్రహములే యాధారభూతములు. హస్తవిభాగసూత్రమిదియే. ద్వాదశ రాసులను బట్టిగాని సప్తవింశతీ నక్షత్రములను బట్టిగాని కొందరుశాస్త్రవేత్తలు హస్తవిభాగము చేయ వలనుపడదా యని శంకింపవచ్చును. ఈప్రశ్న యుక్తియుక్తముగ దోచినను శాస్త్రసమ్మతముగ నుండదని యూహింపవలెను. నవగ్రహ పరిపాలిత ద్వాదశరాసులకంటె పరిపాలక నవగ్రహములు బలవత్తరములైనవిగ జ్యోతిశ్శాస్త్రము ఘోషించుచున్నది. కాన నైపద్ధతి ననుసరించి హస్తవిభాగ క్రమము గావించినచో శాస్త్రవిరుద్ధముగ దోచును. అశ్విన్యాది సప్తవింశతి నక్షత్రములు మానవుని జీవితమును పాలించు విషయము కొంతవరకు సత్యమేమైనను ఈ 27 నక్షత్రములు గ్రహములకు లోబడియుండుటవలన (అనగా గ్రహములకన్న నక్షత్రములు తక్కువ బలము గలవనుట) నవగ్రహములనుబట్టియే విభాగములను సల్పవలసియుండును. విపులవిమర్శనమునకై "హస్తశాస్త్ర" మను నాచే రచింపబడిన గ్రంథమును చదువుడు. (అచ్చగుచున్నది.)

హస్తములన్నియు 9 తరగతులుగ ఎట్టకేలకు విభాగింపబడుచుండును. (1) కవితా హస్తము (2) వేదాంతహస్తము, (3) శిల్పహస్తము, (4) విక్రమహస్తము, (5) శుభదాయిహస్తము, (6) సులభహస్తము, (7) యథాజాతహస్తము, (8) భద్రహస్తము, (9) సౌఖ్యహస్తము. మిశ్రమహస్తమనునదికూడ యుండును. ఇది 9 హస్తజాతులలో కొన్నిజాతుల సమ్మేళమును పొందియుండును.

రాబోవు సంచికయందు హస్తజాతులయొక్క లక్షణములు పాఠకమహాశయులకు విశదమగు రీతిని హస్తములయొక్క చిత్రములతో సహా విమర్శింపబడును.

## రేఖా శాస్త్రము

భరతఖండముయొక్క సభ్యత, సాహిత్యాది విజ్ఞానము, శాస్త్రములు, బహుప్రాచీనములు. ఈశాస్త్రప్రాచీనతను గ్రహించవలసియున్నచో క్రీ॥ శ॥ కొన్ని వేలసంవత్సరములకు బూర్వము చెప్పవలసి యుండును. అతిప్రాచీనమైనదియు ఆదరణీయమైనదియు నగు మహావిద్య వేదము. ఇట్టి యతిప్రాచీనమైన యాగమములకు జ్యోతిషము షడంగములలో నొకటి. ఇందువలన ఈ శాస్త్రము పాచీనమైనదిగ బోధపడు చుండును.

జ్యోతిషమునిన ఒకజాతకశాస్త్రమేగాక, గ్రహములవలనను జ్యోతుల చారములవలనను వాటిస్థితి సమ్మేళనముల వలనను భూతభవిష్యద్వర్తమానములనుదెల్పుచుండుటచేదితరశాస్త్రములన్నియుగూడ జ్యోతిశ్శాస్త్ర భాగములుగ పరిగణింపబడుచుండును. ప్రజా జీవిత సూచక శాస్త్రముగాన ప్రజాదృక్పథమును మరల్చి వారి హృదయమున గౌరవభావమును నెలకొల్పుచుండును. మానవుల భూత భవిష్యద్వర్తమానములను తెల్పుచుండు శాస్త్రములయందు రేఖాశాస్త్ర మొకటి. ఈశాస్త్రము సాముద్రిక శాస్త్రములోని యొక భాగము. ఈశాస్త్రము వలనమానవునిజీవితమున సంవత్సరవారీగాజరుగుచుండు వివిధములగు జన్మఫలముల నతి ఋజువుగను అసందిగ్ధముగను హస్తము చూపుచుండును. సాముద్రికశాస్త్రభాగము లన్నింటిలో నిది మిగుల యనుభవనీయమైనది.

హస్తమున జీవకళలతోడను అద్భుత ప్రకాశముతోడను వెలుగొందుచుండు కొన్నిదీర్ఘములగు రేఖలు కంటికి కగబడుచుండును. కాంతివంతములగునట్టియు మానవకర్మను సూచించునట్టియునీశ్వర లిపియగు నీభాషాపంక్తులే రేఖలని సాముద్రికశాస్త్రమున వ్యవహరింపబడుచున్నవి. రేఖాస్వరూపమును మానవు డూహింపవలనుపడదు. ప్రకృతి నంతట చరాచరాదుల యందంతట నిబిడీకృతమై యున్న యొకమహాతేజము రేఖాగర్భితమై యున్నది. ఆతేజ మవాఙ్మానస గోచరమైయున్నది. రేఖ నాశనరహితమైనది. రేఖయనగా మానవకర్మను సూచనచేయు నీశ్వర శాసనము. మానవుడు రేఖాబలమును జయింపలేడు. హస్తమందు రేఖలుండుటయేగాక దేహమునందంతటను ప్రకృతియందున్న ప్రతి యణుస్వరూపమునుండి మహామేరువువరకును రేఖలుండి వాటిబలములకు లోనైయున్నవి. ఒకమానవుని హస్తమునందు రేఖాశ్రేణి యతని జీవితము మాత్రమేగాక యతని కర్మకు సంబంధించు సమస్త చరాచరాదుల యొక్కయు నితర మానవజీవితముల యొక్కయు, కొంతవడి విశ్వముయొక్కయు చరిత్ర తెలియజేయుచుండును. కావున రేఖాశాస్త్రము గోప్యముగనుండియు ప్రత్యక్షముగ రేఖాపంక్తులద్వారా కంటికగపడుచుండును. హస్తమంతయు రేఖలుచే నిండియుండును. ఇట్లుచిక్కులుచిక్కులుగనుండియు కూడ ఈశ్వరసృష్టిననుసరించియు, ఈశ్వర సృష్టి క్రమపద్ధతులకులోనై యుండుటయు చూడ నీశ్వర సృష్టి రహస్యభావములు మానవమనసునకు తగులుచుండును, ఈరేఖాపంక్తులన్నియు నొక్కొక్క తల్లిరేఖకు సంబంధించియుండును. తల్లిరేఖను రేఖాకందమనికూడ వాడవచ్చును. హస్తమున రేఖాకందములనేకములుండును. ఇవన్నియు శుభరేఖాకందములనియు అశుభరేఖాకందములనియు ద్వివిధములుగవ్యవహరింపబడుచుండును. శుభరేఖాకందమునుండి శాఖోపశాఖలుగ వ్యాపించు రేఖలన్నియు శుభరేఖలుగను, అశుభరేఖాకందమునుండి వ్యాపించు శాఖలన్నియు అశుభరేఖలుగను వాడవలసియుండును. ఇందు శుభరేఖలు శుభఫలములను అశుభరేఖలు పాపఫలములను నిచ్చుచుండుట యనుభవసిద్ధము. హస్తమున రేఖలెక్కువగానున్నచో దరిద్రమనియు మనఃక్లేశమనియు శాస్త్రము తెలియని మూర్ఖులు కొందఱు వచించుచుందురు. హస్తమున నశుభరేఖలు విస్తరించియున్నచో జీవితమంతయు కష్టములకు లోనైయుండును. హస్తమున నిండియున్న రేఖలన్నియు శుభకందములనుండి వ్యాపించియున్నవైనచో జీవితమంతయు మహాసౌఖ్యముల తోడను

వాహనాది మహాభోగములతోడను, సౌఖ్యావహమైయుండును. కావున హస్తమునందు రేఖాసంగతములయొక్క యల్లికల శుభత్వ పాపత్వములనుబట్టి జీవితఫలములను నిర్ణయించుచుండవలయును. కాని బహు రేఖలవలన దరిద్రమని చెప్పుట యశాస్త్రీయము.

శుభ రేఖలయందును పాప రేఖలయందును వివిధములగు జాతులు మరలయుండును. రేఖలయందనేకతరగతులున్నవి. (ప్రస్తుతము) ప్రాధాన్య రేఖలు, అప్రాధాన్య రేఖలు, సంగత రేఖలు, (crossed lines) విఘాత రేఖలు, (cut lines) వికృతి రేఖలు, (curved lines) గర్భిత రేఖలు, (islandedlines)విచ్ఛిన్నములు,(broken lines) అవిచ్ఛిన్నములు, (well cut lines) కోణములు (Triangles) కోణభాగములు, కేంద్రములని (Squares) కేంద్ర రేఖాభాగమనియు(Sidelines of the Square) కర్తరీ రేఖయనియు, మాయ రేఖయనియు, (breached line) అనేకవిధములు. సందర్భానుసారముగ యీ రేఖలను గూర్చి ముందువ్యాసములయందు వ్రాయుచుందును.

ప్రస్తుతము ప్రాధాన్య రేఖలను గూర్చి వ్రాయుదును. ఇచ్చట కొన్ని ప్రాధాన్య రేఖల పేర్ల నుదహరించుచున్నాను. మానవుని సాముదాయక జీవితము ప్రాధాన్య రేఖలనుండి స్థూలముగ తెలియు చుండును. స్థూలభావములగు దేహసౌఖ్యము, ఆయుర్దాయము, కుటుంబవృద్ధి, సుఖము, ధనసంపాదన, సోదరీ సోదరభాగ్యము, స్వప్రయోజకత్వము, భూమి, గృహములు, మాతృసుఖము, పుత్రసంతానము, ధర్మచింతనము, బుద్ధికుశలత, రోగము, ఋణము, జ్ఞాతులు, వారివలనపీడ, కళత్రసుఖము, భోగము, స్త్రీవాంఛ, భాగ్యవృద్ధి, తపస్సు, కీర్తి, రాజ్యము, మానాభిమానములు, జీవనము, లాభము, మోక్షము, కైవల్యము మొదలగు ఫలములన్నియు వివిధతరగతులగు రేఖలు చూపుచుండును. వీటిలో కొన్ని ముఖ్య రేఖలనుగూర్చి ఈ వ్యాసమున వ్రాయుచున్నాను.




| | |
|---|---|
| 1 పురుష రేఖ | 6 హంశ రేఖ |
| 2 సన్మిత్ర రేఖ | 7 మూల రేఖ |
| 3 ఆధార రేఖ | 8 యవ రేఖ |
| 4 ఆత్మ రేఖ | 9 సుభద్ర రేఖ |
| 5 మధ్యమ రేఖ | |




10 పింగళరేఖ - 4 క్రిందవంకరగానున్నది
11 కపిలరేఖ - 2 కి 1 కి మధ్య నున్నది
12 భద్రరేఖ - 1 తరువాతనున్నది
13 శిల్పరేఖ - 3 కిముందున్నది

ఒక్కొక్క రేఖ కొక్కొకతరగతి కారకత్వము, గుణస్వభావాదు లుండును. ఒక్కొక్క రేఖ మానవజీవితమున నొక్కొక్క జీవితభాగమును పాలించుచుండును. ఒక రేఖసూచించు ఫలములను గూర్చిమరియొక రేఖను పరీక్షించినచో ఫలములు సరిగరావు. ఒక కచేరిలో నుండు రికార్డు గుమాస్తాను మరియొక గుమాస్తాచేయు పనిని గూర్చి భోగట్టాచేసినచో వారు నాకు తెలియ దందురు. ఏపనిచేయుచుండుగుమాస్తాను ఆపనిని గూర్చివిచారించినచో, ఆపనియొక్క వివరము లన్నియు తెలియుచుండును, అట్లులనే ఒక రేఖకు జెందియుండు జీవిత భాగమునుగూర్చి యా రేఖను బాగుగా పరిశీలన మొనర్చినచో ఆజీవిత భాగమంతయు విపులముగ తెలియుచుండును. మానవజీవితభాగము లనేకము లున్నను, యవి యన్నియు, శాస్త్రముల ననుసరించి పండ్రెండు భాగములుగ భాగింపబడినవి. ఈజీవితభాగము లనే ద్వాదశభావము లందురు.

(1) తనుభావము(2) ధనభావము (3) సోదర భావము (4) భూమిగృహభావము (5) పుత్ర భావము (6) శత్రుభావము (7) కళత్ర (భార్య) భావము (8) ఆయుర్దాయభావము (9) భాగ్య భావము (10) రాజ్యము లేక ఉద్యోగ, జీవన కృషిభావము (11) లాభభావము (12) మోక్ష భావము.

మానవుడుచేయు కృషియంతయు నీద్వాదశ భావములయందు నేదేనియొకదానికిచెందును.

(1) పురుష రేఖ గుణస్వభావాదులు:—

ఈ రేఖనుబట్టి ప్రతిమానవుని దేహసుఖము, ఆరోగ్యము, దేహస్వరూపము, ఆయుర్దాయము, రోగములు, జీవనకృషి విశేషము, జీవితసాము దాయక ఫలములన్నియు స్థూలముగ తెలియు చుండును. వ్యక్తిగతమగు ప్రతిష్ఠ, పౌరుషము, స్వప్రయోజకత్వము, పురుషాశయములు, మా నవు డనుభవించు ఉచ్చనీచావస్థలు ఈరేఖ స్ఫుటముగ చూపుచుండును.

(2) పురుష రేఖ ఉత్పత్తి:—

ఈ రేఖ తర్జని (చూపుడు వ్రేలు) యడుగు భాగమునుండు గురుగోళముక్రింద భాగమున నుత్పత్తియై ధనురాకారమునువహించి రాహు శుక్రగోళములను హద్దుచేయుచు తిన్నగా మణి బంధమునకు వ్యాపించియుండును. ఇది యొంటిగ పుట్టక జంటగ ఆధారరేఖతో నుత్పత్తియై శనిగోళమువరకును కలసికొనివచ్చి తదుపరి యా

రేఖను విడచి దిగువకు చీలిపోయి ధనురాకారముగా మణిబంధమువరకును వచ్చును.




(ఆలుమగల రేఖలని వాడు రేఖ లివియే) ఈ రేఖ యిట్లున్నచో బలమైన పురుష రేఖయని భావింపవలసియుండును. ఈ రేఖలేని హస్తము, జగత్తంతయు వెదకినను దొరకదు. హస్తమున నిది మిగుల ప్రధాన రేఖ. దేహమునకు ఆయుర్దాయము లేక జీవ మెట్లు ప్రధానమో, జీవము లేక దేహ మెట్లు సృజింపబడదో, అట్లే యీ రేఖ లేక హస్తము సృజింపబడదు. దేహమును జీవ మెట్లు ప్రకాశింపజేయునో పురుష రేఖ హస్తమును అట్లే ప్రకాశింప జేయుచుండును. ఈ రేఖకు ఎచ్చటెచ్చట కొట్టుబాట్లును పాప రేఖలసంబంధమునుండునో, యాయాకాలములను సూచించు వయోభాగములయందు రోగములు, గండములు, అపజయములు, కష్టములు గలుగును. ఈ రేఖ రెండుహస్తములయందును సమానమును పొందియున్నచో, ఆజన్మాంతము ఆగర్భశ్రీమంతుడును, లేక స్వార్జితమువలన గొప్ప ఐశ్వర్య సుఖములను భోగములనుపొంది పుత్రవంతుడునై సుఖించును. ఈ రేఖ యొక్క పూర్ణ వివరములు రాబోవు పత్రికయందు వ్రాయబడును.




| | |
|---|---|
| గు = గురువు | శ = శని |
| ర = రవి | బు = బుధుడు |
| రా = రాహువు | కే = కేతువు |
| శు = శుక్రుడు | కు = కుజుడు |
| చ = చంద్రుడు | |

# అద్భుతమైన స్త్రీహస్తము.

ఎం. ఆర్తర్ ఆడెమ్సుగారు ఈజిప్టుదేశ సంచారమొనర్చి ఇంగ్లండుకు తిరిగివచ్చినపుడు తనతో నొక మానవ హస్తమును గొనివచ్చెను. ఆహస్తము ముంజేయివఱకుమాత్రమేయుండెను. ఈజిప్టుదేశముననుండు ఒక శవకుటీరమునందది లభించినట్లు చెప్పిరి. మృతకళేబరములు చీకి చెడిపోకుండ చిరకాలము నిల్వయుండుటకు ఓషధీ సాధనములను ఈజిప్టు వైద్యవేత్తలు కనుగొనియుండిన సంగతి లోకవిదితము. ఈహస్తము పూర్వమెప్పుడో ఓషధుల లేపమువలన చీకి చెడకుండ భద్రపరుపబడెను. ఇప్పుడా హస్తమును తిలకించిన సజీవులహస్తమును బోలియున్నది. ఆ ముంజేతిని ఎవ్వరైనను తమహస్తములయందిడుకొని పరీక్షించిన, చేతియందు నాడులుకొట్టుకొనుచున్నటులనే దోచును. చేతియందము, ఆకారము, మృదుత్వము కొంచమైనను మారినట్టు గన్పడదు. అది అమృత హస్తమనియు మహత్తరములైన మహిమ లందు లీనములై యున్నవనియు ఇంగ్లండునందనేకులకు గాఢమగు నమ్మికగలదు. ఔషధ ప్రయోగములవలన సాధ్యముకాని వ్యాధిగ్రస్తులనేకులు ఈ హస్తస్పర్శనమువలన సుఖపడుచున్నారు. దీర్ఘకాలముగ పక్షవాతముచే బాధపడుచుండిన యొక స్త్రీ యీమొండి చేతిని మూడు పర్యాయములు తాకినంత మాత్రముననే ఆమె పక్షవాతరోగము మాయమాయెను. ఇటులనే అనేకులు రోగులు తమ జాడ్యముల కుదుర్చుకొని సుఖ మనుభవించుచున్నారు.

ఆర్తర్ ఆడెమ్సుగారుతనకీహస్తము లభించిన వివరముల నిట్లు చెప్పిరి.

"నేను ఈజిప్టుదేశమున సంచరించుచుండినప్పుడు ఒక నరహస్త మాహాత్మ్యమును గురించి వింటిని. 25,000 పౌనులు వెలగల యొక రత్నఖచితమైన పెట్టెయందుంచబడి, యీ హస్తమొక శవకుటీరమున భద్రపఱుపబడి యుండెను. దీని మహిమ నెఱింగినవాడొకడు దీని నపహరించి తనయింటియందు దాచుకొనెను. ఆ హస్త మీతనియొద్దనున్న సంగతి కొందరికి మాత్రమే తెలియును. అట్టి మహత్తర దివ్య తేజోవంతమగు హస్తమును దర్శించుటకు నాకు భాగ్యము గలిగెను. అపుడు నేను వానికి 50 పౌనులు మాత్రమునిచ్చి దానిని తీసుకొన గల్గితిని. ఇంగ్లండుకు రాగానే మ్యూజియం అధికారులకీచేతినిచూప, ఈ చేయిగల మనిషి సుమారు 3500 సంవత్సరములనాడు మరణించి యుండవచ్చునని వాక్రుచ్చిరి. మరియు అదియొక స్త్రీహస్తమనియు, ఆమె కీర్తిబడసిన మహారాణియో, త్రిలోకసుందరియో లేక దివ్యజ్ఞానియగు వీరమాతయో యై యుండవచ్చుననియు చెప్పిరి. వస్తుప్రదర్శన శాలాధికారులు హస్తమునకు మంచి వెలయిచ్చి మ్యూజియమునందు బెట్టదలచిరిగాని నేనందుల కొప్పనైతి. నేనేదానిని స్వయముగ పరీక్షించి వెల్లడి చేయదలంచితి.

అనేక సాముద్రిక శాస్త్రవేత్తలు, తత్వజ్ఞానులు, చరిత్రకారులు ఈహస్తమును వీక్షించి అచ్చెరువందిరి. ఈహస్తమునుకలిగిన స్త్రీరత్నము భూలోకసుందరిగను దివ్యశక్తివంతురాలుగను దేశసంరక్షణకై జీవమును పరిత్యజించి యుండవచ్చునని పండితులందరుచెప్పిరి. అట్లుకానిచో నీయమృతహస్త మిట్టితేజోమయమై యుండజాలదని నుడివిరి.

ఇంతకాలమువరకు ఈహస్తము చీకిచెడిపోకుండా భద్రపరుపగల్గిన దివ్యౌషధమును ఆనాడే వీరు కనుగొనినందులకు నవీనశాస్త్రజ్ఞులు విభ్రమ మొందుచున్నారు. [గృహలక్ష్మినుండి.]




# జ్యోతిష సంశయములు.

ఆకెళ్ల వెంకటశాస్త్రిగారు

భగవంతునిచే వేదముయొక్క షడంగములలో నొకటియైన జ్యోతిశ్శాస్త్రము, లోకోపకారముకొరకే సృజింపబడినది. ఇటువంటిశాస్త్రము నిజమా యబద్ధమా యను సంశయము కొందఱికిని; ఇది నిజమైనను దీని ననుసరించి సరియైనజాతకఫలితములను చెప్పగలజ్యోతిష్కులుగలరా యను సంశయము మరికొందరికిని గలుగుచున్నది. దీనికి సరియైన సమాధానములు సర్వజనులకు తెలియును. ఇవిగాక, వీనికి మించిన గొప్పసంశయములు గొన్ని గలవు. ఇవి మిక్కిలి ప్రజలను బాధించుచున్నవి. అవి యేవి యనగా :

1. ఖేచరములగు గ్రహములవలన భూచరులగు మనుజులకు సుఖదుఃఖములు లాభనష్టములు గల్గునా?
2. ఈగ్రహములు మనుజులకు మంచిచెడ్డల నెట్టు లియ్యగలవు?
3. ఈ గ్రహములకు మనుజులకు గల సంబంధమేమి?
4. మనకు రాబోవుకష్టములను రాకుండా చేసుకొనుటకు మనకు సమర్థత గలదా; లేదా?

వీని కన్నిటికిని నాశక్తికొలది తగుసమాధానములను ఈ దిగువ వ్రాయుచున్నాను. వీనివలన చదువరులకు కొంతవరకు సంశయములు తీరునని నా అభిప్రాయము.

ప్రపంచమునందు భగవంతునిచేత సృజింపబడిన జీవులలో నొక జీవునికంటె మరియొక జీవికి కొంతవిశేషశక్తి గలదు. వానిలో నితరజీవులకంటె మనుష్యులకు విశేషశక్తి గలదు. ఖేచరములగు గ్రహములు గూడ భగవంతునిచే సృజింపఁబడినవి గనుక అట్టి గ్రహములకు మనకంటె విశేషశక్తి గలదు. ఇది సర్వజనులకు తెలిసినవిషయమే; ఈసృష్టిలో కొన్నిజీవులు మరికొన్ని జీవులయొక్క సహాయమువలన వృద్ధిపొందుచున్నవి. వానివలననే నాశమును గూడ పొందుచున్నవి. ఈ విషయములో నిట్లుండగా మనకంటె విశేషశక్తిగల గ్రహములవలన గూడ మనకు లాభనష్టములు గలుగుటకు సందేహముండునా? ఇది అనుభవముచేతను బుద్ధిచేతను తెలియ తగినవిషయమై యున్నది. గ్రహములలో గ్రహరాజగు సూర్యునివలన సమస్తజీవులకు నెట్టియుపకారము జరుగుచున్నదో సర్వజనులకు దెలియును. మనము చేయు సంధ్యావందనాది కర్మలయందు ముందుగా సూర్యప్రార్థనయే చెప్పఁబడుచున్నది. గాయత్రీజపమునందు నెల్లప్పుడును సత్కర్మలనే చేయునట్లుగా ప్రేరేపించవలసినదని మనము సూర్యుని ప్రార్థన చేయుచున్నట్లు గనబడుచున్నది. శ్లో॥ నమః సవిత్రే జగదేకచక్షుషే, జగత్ప్రసూతిస్థితినాశహేతవే త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే విరిఞ్చినారాయణశఙ్కరాత్మనే॥ అను శ్లోకము ననుసరించి యీ సూర్యుడు త్రిమూర్తులయొక్క స్వరూపముగలవా డనియు కేవలము పరబ్రహ్మస్వరూప మనియు జెప్పఁబడుచున్నది. పది రోజులు సూర్యరశ్మి లేనియెడల సూర్యునివలన లాభమో నష్టమో మనకు తెలియగలదు.

కొన్ని దేశములయందు సూర్యరశ్మియేలేదు. అట్టి దేశములయందు నివసించు ప్రజల కెంతబాధ గలుగుచున్నదో చెప్పుటకు పరిమితిలేదు. చంద్రోదయమువలన సముద్రము పొంగుచున్నది. చంద్రాస్తమయమువలన అణగుచున్నది. అదిగాక చంద్రునివలన నెన్ని యోషధు లభివృద్ధి బొందుచున్నవో దెలిసికొనుడు. మనకు చంద్రుడు దగ్గరగా నుండుటవలన యీ చంద్రునివలన మనకు లాభనష్టములు గలుగుట యాశ్చర్యకరమయిన సంగతిగాదు. దీనికంటె అనేకలక్షలయోజనముల దూరములో నున్న సూర్యునివలనను యీసూర్యునికంటె మిక్కిలి దూరముగానున్న శని మొదలగు గ్రహములవల్లను మనకు లాభనష్టములు గలుగుచున్నవి. కాని యీ గ్రహము లన్నియు గ్రహరాజగు సూర్యు ననుసరించియే తిరుగుచున్నవి. సూర్యునివలన లాభనష్టములు మన కెట్లు ప్రత్యక్షముగా గనబడుచున్నవో తక్కిన గ్రహములవలన గూడ నానావిధముగనే మనకు లాభనష్టములు కలుగుచున్నవని అనుభ

వముచేత మనకు గనబడుచున్నది. పంచగ్రహకూటము సప్తగ్రహకూటము మొదలగునవి కలిగినప్పుడు దేశారిష్టములు గలుగుచున్నవి. ఏజాతకుడైనను జననమైనప్పుడు వానిజాతకమునందు శని పంచమమందున్నయెడల, నాశని దశ వచ్చినప్పుడు సంతాననష్టము కనబడుచున్నది. కుజుడు సప్తమమందున్నయెడల, కళత్రనష్టముగాని, కళత్రసౌఖ్యము లేకపోవుటగాని సంభవించుచున్నది. గోచారమునందు యేకాదశమునందు గురుడున్నయెడల ఒకప్పుడు మంచి ఫలములు లభింపకపోయినను ద్వాదశజన్మములయందు శని యున్నయెడల, యనేక చిక్కులు యీశనివలన తటస్థించుచున్నవి. ఇది యనుభవముచేత తెలియదగిన విషయము. జాతకముగాని, జన్మనక్షత్రముగాని లేనివారికీసందేహములు విడుట కష్టము. అట్టివారు యీ శాస్త్రమునే నమ్మరు. కనుక సరియైన జాతకచక్రము గలవాడును, జ్యోతిశ్శాస్త్రమును చక్కగా పరిశీలన జేసినవాడును, తన స్వశక్తివలనగాని, ఇతరజ్యోతిష్కులయొక్క సహాయమువలనగాని తనయాయుర్దాయమును సరిగా తెలిసికొనును. యోగాభ్యాసపరులగువారు వారికి రాబోవు అకాలమృత్యువును దాటి వారియొక్క యాయుర్దాయమును వృద్ధిచేసికొనగలరు. వారియొక్క బుద్ధిచేతను ముందు రాబోవు కష్టములను సాధ్యమయినంతవరకు రాకుండ చేసికొనగలరు. ఒకవేళ అట్టికష్టములు లభించినను వానికి విచారింపరు. బుద్ధిమంతుడైనవాడు తన యాయుర్దాయమును దెలిసికొని సదాచారము, సత్ప్రవర్తన, సజ్జనసాంగత్యము మొదలగు మంచికర్మలను జేయుచు, మిక్కిలి ధర్మాత్ముడై భక్తిజ్ఞానవైరాగ్యములను జెంది చివరకు మోక్షమును బొందును. బుద్ధిచేత కొంచెమాలోచించినయెడల ప్రతిమనుజునకును ప్రతిరోజున తన యాయుర్దాయము క్షీణించుచున్నదనుసంగతి తెలియును. తనకు 30 సం॥లు వయస్సు వచ్చినదని సంతోషమేగాని తన యాయుర్దాయములో 30 సం॥లు తగ్గిపోయినవని పామరునకు తెలియదు. పామరుడు తానింకను తనయాయుర్దాయము తెలియక విశేషకాలము జీవింతునని యాసజెంది, యీషణత్రయమువలన సంసారసాగరములో మునిగి తేలుచుండును. పూర్వకాలమునందు ఖట్వాంగమహారాజు దేవతల కుపకారము చేసి, వారివలన తనయాయుర్దాయమును తెలిసికొనగా, నిక రెండుఘడియలుమాత్ర మున్నదని చెప్పిరి. ఆసమయమందు తనరాజ్యమంతయు వెంటనే పరాధీనము చేసి, మిక్కిలి వైరాగ్యమును జెంది ఆ రెండు ఘడియలలోనే మోక్షమును జెందెను అని భాగవతమునందు జెప్పబడియున్నది. అందువలన బుద్ధిమంతుడగువాడు విశేషప్రయత్నము చేసి, గురుశుశ్రూషవలన గాని, సజ్జనసహవాసమువలనగాని, తన యాయుర్దాయమును దెలిసికొని మంచి మంచికర్మలనుజేయుచు, దుర్గతి జెందక చివరకు జన్మరాహిత్యమును జెందును. అదిగాక మనకు రాబోవు కష్టములను రాకుండ జేసికొనుటకు గ్రహశాంతి యని యొకటి జెప్పబడియున్నది. గ్రహశాంతి యనగా భగవదంశగల గ్రహములరీత్యా భగవంతునే యారాధన చేయుటయనియు, తన శక్తికొలది బీదలకు దానధర్మములు చేయుటయనియు నర్థము. ఈగ్రహశాంతి యనునది సత్కర్మగాని దుష్కర్మగాదు. ఈశాంతి చేయుటచే గ్రహములవలన మనకు కష్టఫలములుగలుగవు. ఎప్పుడును సత్కర్మచేయుటవలన దానిఫలము వెంటనే కనబడకపోయినను మరియొకజన్మమందయినను గనబడితీరును. దీనినే పురాకృతకర్మ యని యందురు.

శ్లో॥ వనే, రణే, శత్రు జలాగ్నిమధ్యే మహార్ణవే పర్వత
మస్తకే వా । సుప్తం ప్రమత్తం విషమస్థితం వా,
రక్షంతి పుణ్యాని పురాకృతాని॥

అను శ్లోకము ననుసరించిమంచికర్మలు చేయుపుణ్యపురుషుని వాడెట్టియాపత్తులో నున్నను, వానిపురాకృతపుణ్యములు వానినితప్పక గాచును. గ్రహశాంతి యనునది మంచి కర్మయే గనుక తనకు కష్టఫలము రాబోవునపుడు గ్రహశాంతి యవసరముగా గనబడుచున్నది. పామరుడైన వాడు తాను చేసినపురాకృతకర్మ మెట్లులున్నదో యాప్రకారము జరుగును గాని మనమెంత ప్రయత్నము చేసినను లాభము లేదనియు మనకు రాబోవు కష్టసుఖములు, వానియంతట యవే వచ్చుననియు, అవి రాకుండ జేసికొనుటకు మనకు సాధ్యము గాదనియు తలచి, యేవిధమైన ప్రయత్నము చేయక, తనయాయుర్దాయ మంతయు వృథాగా గడపిపుచ్చును. అదియుగాక దురాచారము, దుర్జనసాంగత్యము, దురభ్యాసము, దుష్ప్రవర్తన మొదలగుదుష్కర్మలనుజేయుచు, తుదకు దుర్గతిజెందును. బుద్ధిమంతుడు తన యాయుర్దాయము వృథాగాగడపిపుచ్చక, మంచికర్మలనే జేయుచు, విశేషమానుషప్రయత్నము చేయుచు, తనకు రాబోవు కష్టములను సాధ్యమయినంతవరకు రాకుండ కాపాడుకొనును. విశేషప్రయత్నమువలన అనగా యోగాభ్యాసము, తపస్సు మొదలగువానివలన మనుజుడు ఎట్టిపనినైనను సాధించవచ్చును. అన్నిటికంటెను మిక్కిలి విలువయైన తనయాయుర్దాయమునే వృద్ధి జేసుకొనగలడు. అట్టివిషయములో తనకు రాబోవు కష్టములను రాకుండ జేసికొనుట వానికొక యసాధ్యమైనపని గాదు. ఇది విశేషప్రయత్నము చేయువారికిగాని సామాన్యప్రయత్నము

చేయువారికి లభించదు. ఏజన్మయందైనను మంచికర్మ చేసినపిమ్మటగదా ముందు రాబోవు జన్మయందు తాను మంచిఫల మనుభవించుట. అట్టి మంచికర్మ చేయుటకు తగినయాధార మేది? తనయాయుర్దాయము తెలిసికొనుటయే! అట్టి యాయుర్దాయమును తెలిసికొనుటవలన ముందుగా సజ్జనసాంగత్యము లభించును. సజ్జనసాంగత్యము, వచ్చియున్న యాపదను రాగలయాపదను రెంటిని దప్పించును. గంగాజలము త్రాగినవారికి అప్పటిదప్పినిదీర్చుటయేగాక, పిమ్మట రాబోవునరకపాతమును గూడ దప్పించును.

అట్టి సజ్జనసాంగత్యము సంపాదించవలె ననుబుద్ధి దేని వలన గలుగుచున్నది? తన యాయుర్దాయము ప్రతిరోజున క్షీణించుచున్నదనియు, తనకిక యాయుర్దాయ మెంతో కాలము లేదనియు, ఇకముందు తాను చేయవలసిన పని యేది యనియు, ఇట్టి సంగతులు విచారణచేయుట చేతనే. తనయాయుర్దాయమును గురించి విచారణ చేయుటకు తగిన యాధారమేది? జాతకము. బుద్ధిమంతుడైనవాడు తనజాతకమువలనముందుగా తనయాయుర్దాయమునే తెలిసికొనును. దానివలన పైన వ్రాయబడిన విషయములన్నియు క్రమక్రమముగా గ్రహించును. ఇంకను నీపై ప్రశ్నలకు తగు సమాధానము లనేకములు గలవు.

---

# జ్యోతిష మనగానేమి?

జ్యోతిషమనగానేమి? జ్యోతిః అన సూర్యచంద్ర నక్షత్రములను బోధించును. వాటినిగురించి తెలుపు శాస్త్రమునకు జ్యోతిషమనిపేరు. ఇది స్కంధత్రయాత్మకముగా (3 భాగములుగా) విభజింపబడినది. 1 ముహూర్త భాగం 2 సిద్ధాంతభాగం 3 జాతకభాగం. ఇట్టి త్రిభాగాత్మకమయిన జ్యోతిషము ప్రజలకు ఉపయోగకరముగాదనియు ఇదిఅసత్యమనియు ఆధునికులు నొక్కివక్కాణింపవచ్చు ననియెదరు. ఇందునుగురించి చర్చించగా జ్యోతిషము వేదమువలె సర్వజనసామాన్యముగాప్రమాణ పదవి నధిష్ఠించినది. సర్వజనుల కత్యంతావశ్యకమయినది. తప్పక ప్రతిమనుజుడును తెలిసికోదగినది. అట్లు తెలిసికొనకపోవుటలో అత్యంతకష్టనష్టములు వాటిల్లును. ఈ జ్యోతిషమసత్యమనుటకు "మతిక్షయాన్నివర్తంతే న గోవిందగుణక్షయాత్" అనురీతి ఈమనుజులబుద్ధిమాంద్యదౌర్బల్య పండితంమన్యత్వములచే జ్యోతిషమునకిట్టి యపఖ్యాతి ఘటిల్లినది. కాని జ్యోతిషమువంటి ప్రత్యేకశాస్త్రము వేరొకటిలేదు, భుజించుటకు అన్నము అనుపానము లెటులనో ఇహపరలోకసౌఖ్యములు పొందుటకు వేదము వేదాంగములునుఅట్టివి. ఆవేదాఙ్గములలోకూడా 'సర్వేంద్రియాణాం నయనంప్రధానం' అనురీతి నియ్యది వేదమునకు ముఖ్యావయవమైయున్నది. వేదాంగముల ఆరు. "శిక్షా వ్యాకరణంఛందోనిరుక్తం జ్యోతిషంతథా కల్పశ్చేతిషడంగాని వేదస్యాహుర్మనీషిణః" ఈయారింటిలో "జ్యోతిషము" "వేదస్యచక్షుః కిలశాస్త్రమేతత్ప్రధానతాంగేషు తతోస్యజాతా అంగైర్యుతోన్యః పరిపూర్ణమూర్తిశ్చక్షుర్విహీనః పురుషోనభాతి" "ఛందఃపాదౌశబ్దశాస్త్రంచ వక్త్రం కల్పం పాణీ జ్యోతిషం చక్షుషీచ" మరియు "యథాశిఖామయూరాణాం నాగానాం మణయోయథా తథావేదాఙ్గశాస్త్రేషు జ్యోతిషంమూర్ధనిస్థితం" అని జ్యోతిషమునకు ప్రాధాన్యమేర్పడియున్నది. ఇంతియేగాక ధర్మార్థకామమోక్ష చతుర్విధపురుషార్థ సాధనముగానున్నది. "ఏతద్బుద్ధ్వా సమ్యగాప్నోతి యస్మాదర్థం ధర్మంకామమోక్షే యశశ్చ" చక్షుర్ఘ్రాణశ్రోత్రజిహ్వాత్వగింద్రియము లనెడు పంచజ్ఞానేంద్రియములును, వాక్పాణిపాదపాయూపస్థము లనెడి పంచకర్మేంద్రియములును ఇట్లు దశాంగములు లేని శరీరము ఎంతహైన్యముగానుండునో అంగములులేని వేదముకూడా అట్లే యుండును. ఇట్లు ఆలోచించిచూడ చూడ జ్యోతిషము ప్రజాక్షేమస్థైర్యాయురారోగ్యములకు మిగుల ముఖ్యమయినది. అందుకు సందియములేదు. ఇంతేగాక 'ఇతిహాసపురాణాభ్యాం వేదంసముపబృంహయేత్' అని యుండుట వలన వేదాంగఇతిహాసపురాణములతో వేదార్థమును తెలిసికొనవలసినదే కాని కేవలము వేదమాత్రముచే దానియర్థము గ్రహించుటకు వీలుపడదు. కనుకనే పరమాత్మావతారభూతులయిన శ్రీరామకృష్ణాదులచరిత్రాత్మకము లయిన శ్రీమద్రామాయణభారతేతిహాసములయందునను భాగవతాదిపురాణములయందునను సాముద్రికమునుగురించియు జ్యోతిషమునుగురించియు అనేక ప్రమాణములను అందువలన వారికికలిగిన కష్టనష్టలాభములునూ కన్పట్టుచున్నవి. ఈరీతి సర్వప్రమాణములతో జ్యోతిషము సర్వజనులకు ముఖ్యమయినదని నిర్ధారణ మయినది. "అల్పారంభః క్షేమకరః" అని ప్రమాణపదవిని సంక్షేపించితిని. ముందు ఆధునిక లౌకిక యుక్తిజాలముతో జ్యోతిషము సర్వప్రకారముల ముఖ్యమయినదని "జ్యోతిస్సాముద్రిక చంద్రిక" అనుపేరుగల ఈమాసపత్రికలో ప్రచురింపగలము. తర్వాత ఆ జ్యోతిర్లోకమునకు ఈ భూలోకమునకుండు సంబంధమును అందువల్ల కలిగెడు లాభనష్టములను ఇత్యాద్యనేక విషయములను ప్రమాణములతోనూ యుక్తులతోనూ అనుభవముతోనూ ప్రత్యక్షముగనూ సర్వజనులకు విదితమగునటుల పైనుదహ

రింపబడిన పత్రికలో ప్రచురింపబడును. సావధాన మనస్కులరై శ్రద్ధతో పఠించి ప్రచురణము చేయవలయును. మరియు సందియములుకలిగిన నిరభ్యంతరముగ ప్రశ్నింపవచ్చును. అందులకు ఈమితమతులకు తోచిన మట్టుకు సాధ్యమయినంతవరకు సమాధానములను సమగ్రముగ తెలుపగలము. ఇంకనుచూచి చర్చించవలసినవిషయము లున్నయెడల చూచిచర్చించి నిర్ధారించి తెలుపగలము. అందునుగురించి విలంబమయినచో ప్రశ్నలకు సమాధానము రాలేదనియు జ్యోతిస్సాముద్రికముల సత్యములనియు ఇంతమాత్రమునకె పత్రికనేల ప్రచురించవలయుననియు భావింపక సంభాళించవలయును. ఇంతవరకు అసత్యమని ప్రఖ్యాతికివచ్చిన జ్యోతిషము సత్యమని స్థాపించవలసి ఈ పత్రికాప్రచారము చేయబూనినందున "జ్యోతిస్సాముద్రికచంద్రిక"అను పేరుగల యీ మాసపత్రికకు చందాదారులుగ చేరవలయునను పత్రికాసంపాదకుల విజ్ఞప్తిని కరుణతో నంగీకరించి పత్రికను గైకొనుచు తత్వమును తెలిసికొని పుత్రమిత్రకళత్ర బంధుజాలములకు తెలుపవలయునని విన్నవించుచున్నారము.

ఇట్లు,
తిరుమల బుక్కపట్టణం జాతకవిద్వన్మణి వెంకటాచార్యులు
అమరచింతాత్మకూరు సంస్థానాస్థానవిద్వాన్

---

# అనుభవప్రకరణము

సాముద్రికశాస్త్రమునుగూర్చి లోకులకు విచిత్రభావములుగలవు. హస్తరేఖలనుండి ఫలములు తెలియవనియు, రేఖలుమారుచుండుటవలన ఫలములు మారుచుండుననియు, ఇదియంతయు నొకతమాషాయనియు, అనేకజ్యోతిశ్శాస్త్రపండితులు సహితము భావించుచున్నట్లు నాకు వచ్చుచుండు వార్తలవలన తెలియుచున్నది. ఈ భావములను పోగొట్టగలందులకై, హస్తములనుండి భావముల విచారమెంతవరకు విమర్శింపవీలగునో, భూతభవిష్యద్వర్తమానకాలముల ఫలము లెంతవరకు ఋజువుగానుండునో, ఈ దిగువ హస్తముద్రలనుండి నాచే జెప్పబడినఫలములనుచదివి, ఇట్లు జాతకములనుండి ఫలములను చెప్పుటకు వీలగుట కవకాశముగలదా యను సంశయమును సిద్ధాంతీకరించవలసియున్నది. ఈపత్రికయందు నొకమానవుని రెండు హస్తప్రతిమ (Hand - Prints) లీయబడును. వీటినిబట్టి సాముద్రికశాస్త్రవేత్తలుఫలములు వ్రాయుదురుగాక ! అదే మానవుని జన్మతేది జననకాలఘడియలు జాతకచక్రము వలయుసమస్తసామగ్రి యీయబడును. జాతకశాస్త్రకోవిదులు వీటినిబట్టి ఫలములను వ్రాయుదురుగాక! మాకు పంపబడిన సాముద్రికశాస్త్రఫలములను, జాతకశాస్త్రఫలములను, ఈ పత్రికయందు ప్రచురించినచో, సాముద్రికజ్యోతిషపండితులకును, లోకులకును, ఏశాస్త్రమునకుసంబంధించిన ఫలములు సమంజసముగ నుండునో చెప్పకయే స్పష్టమగుచుండును.

ఇట్లు మాపత్రికాకార్యాలయమునకుబంపబడినసాముద్రిక జ్యోతిశ్శాస్త్రఫలము లన్నిటియందును ఎవరుపంపినఫలములనుభవమునకు సరిపడియుండునో, యా పండితునకు జయసూచకముగ నొక సువర్ణపతకముగాని లేక యొక వెండికప్పుగాని ప్రతిమాసమునను నీయబడుచుండును. ఇందుమూలమున లోకమునకు యథార్థమైన శాస్త్రకృషి చేయు పండితులు వెల్లడియగుచుందురు. మైసూరు, గద్వాలు, నేపాలు, తిరువాన్కూరు, ఉత్తరహిందూస్థానం జయపూరు, గ్వాలియరు మొదలగు మహాప్రభు సంస్థానముల నలంకరించు పండితసింహులును, జర్మనీ, అమెరికా, ఇటలీ, యింగ్లండు మొదలగు పాశ్చాత్యదేశములయందు ఘనతవహించినట్టియు నాకు మిత్రకోటిలో చేరినట్టియు జ్యోతిస్సాముద్రిక శాస్త్రపండితులు కూడ ఫలములనుమా పత్రికాకార్యాలయమునకు బంపుచుందురుగాక, ఇందువలన ప్రాచ్యపాశ్చాత్య జ్యోతిస్సాముద్రిక శాస్త్రపండితుల యనుభవములును, శాస్త్రవిజ్ఞానమునకు గల భేదాభేదములును పండితులకును, మా పత్రికాపాఠకమహాశయులకును తెలియుటయేగాక, లగ్నము, గ్రహముల దశాశేషము మొదలగు సందేహములు విపులముగను సశాస్త్రీయముగను సిద్ధాంతీకరింపబడుచుండును. ఇందుమూలమున శాస్త్రపండితుల కీర్తికిని, జాతకసందేహములు గలవారి సందేహములు తొలగిపోవుటకును కారణమగును. ఫలనిర్ణయయోగములనుగూర్చి సాముద్రిక జ్యోతిశ్శాస్త్రసంబంధములగు తీవ్రచర్చలు శాస్త్రార్థవాక్యార్థములు చేయబడుచు శాస్త్రహృదయము శాస్త్రమర్మములు మా పత్రికద్వారా కనుగొనబడుచుండును.

కాన ఉత్సాహవంతులగు సాముద్రికజ్యోతిష కేరళశాస్త్రపండితులందఱును మా యుద్యమమునకు దోడ్పడగలరని నమ్ముచున్నాము. మానవుని భూతభవిష్యద్వర్తమానములను, అదృష్టములనుగూర్చి చెప్పునసమస్తశాస్త్రపండితులును, జ్యోతిస్సాముద్రికచంద్రికను తమ స్వంతపత్రికగ నెంచి తగు యథార్థశాస్త్రకృషి చేయుదురని నమ్ముచున్నాము.

మల్లాది దక్షిణామూర్తిశాస్త్రి.
సంపాదకుడు.